# ప్రస్తావన.

ఈ నవలవ్రాఁత నాతొలిజతనము. ౧౯౧౫ సం॥ "శ్రీశైలయాత్ర" పేర నొక నవల వ్రాసితిని. ఈ "కృష్ణవేణి" అందలినాయికయ. కథావస్తువు నదియు; సన్నివేశములు నట్లు; సంవిధానమున మార్పు లిందుఁ బెక్కులు. తొంటి "శ్రీశైల యాత్ర" లోని భాగములను బెక్కింటినిఁ దొలఁగించితిని. భాషను మఱింత దేటబఱచితిని; బడిపిల్లలకనువుబడఁ జేసితిని.

తెలుఁగునాట నాయాజిల్లాలలో వాడఁబడు జాతీయములను గూర్చితిని. వాక్యముల ఫక్కికలను జూపితిని. చిత్తవృత్తులను జిత్రించితిని. నైసర్గికమును బోషించితిని. వ్యక్తుల సంభాషణమునకు వ్యావహారికము నాశ్రయించితిని. తెలుఁగు నిసుఁగులకు నా యీ యలఁతియూడిగమును బనివడఁజేయ వలఁతులు నిష్పాక్షికులు ఉదారులు విద్యాశాఖీయులు ప్రార్థితులు.

భారతకుటీరము,
పలూరు, ౧౫-౧-౩౭.

—మున్నంగి ... శర్మ.

# కృష్ణవేణి

## ౧. ప్రకరణము.

సాధారణసంవత్సర మాఘ బహుళ సప్తమీ భాను వారమునాఁటి మధ్యాహ్నము ౨ గంటలకు కాకినాడ పాసెంజరు బెజవాడ రైల్వేస్టేషను చేరినది. బండినుండి పెక్కురు పెలపెల దిగినారు. కొందఱు నైజామ్ బండివద్దకుఁ బరువిడినారు. మఱికొందఱు బందరు బండిని సమీపింపఁ బఱచినారు. ఇఁకఁ గొందఱు గుంటూరుబండి దరి కురవడించు చున్నారు. అం దొక యావనుఁడు, కూలివాఁడు సామాను మోసికొని వెంటరా, ముసలమ్మను నడపించుకొనుచుఁ జని గుంటూరు బండిలో మూఁడవతరగతి కంపార్టుమెంటున నెక్కించి నాఁడు. మూటముల్లె సవరించి పెట్టినాఁడు; తాను నుపవిష్టుఁడై కూర్చు న్నాఁడు. జేబులోనుండి ఆంగ్లగ్రంథము నొకదానినిఁ దీసి కడమ చదువనారంభించినాఁడు. అది 'టాల్స్టాయిరిసర్రెక్షన్'. ప్రయా ణికులు పెట్టెల నన్నింటి నాక్రమించుకున్నారు. అంతఁ గొంత వడికిఁ జంకల మూట లెగఁద్రోసికొనుచుఁ జేత చెంబులతో ముప్పురు ఆఁడువారు ఆబండిని దరిసినారు. వారు ఒక్కొక

పెట్టెలో నెక్కఁ బోవుచు, అందు జనము క్రిక్కిరిసియుంటచే నిరాశజెంది ప్రక్కపెట్టె కడ కేఁగుచు బండిపొడవునఁ బలుముచుఁ బాఱుచుఁ దిన్నఁగా యౌవనుఁడును ముసలమ్మయు నున్న పెట్టెకడకు వచ్చి నిలిచిరి. ఆముగ్గురలోని యువతియొకర్తు తలుచు స్టేషన్ వైపునకుఁదిరిగి చూచుచున్నది. మొదటిసారి గంట మ్రోఁగెను. ఆస్త్రీల యాతురతకు జాలి గొని యువానుఁడు తన యున్నపెట్టెలోఁ గూర్చుండ మని తలుపు తెఱచెను. వారు కృతజ్ఞతాసూచకదృష్టి బఱపుచు అడావుడిగ లోనికి మూట లందించి బం డెక్కిరి. వారిలోని యువతి ప్లాట్‌ఫారం వైపు కిటికీవద్దఁ గూర్చుండి తనచూపులను స్టేషను దిక్కునకుఁ బాఱఁ దఱిమినది. కడమ ఇరువురలోని ముసలమ్మ—

"మా బాబూ, నీకు వెయ్యేళ్లాయుస్సు- రక్షించావీవేళ; లేకుంటే మా గతేమయ్యేది?-" అని మేలు దలంచుచున్నది. ఈమె అఱువదేండ్ల ముదుసలి వితంతువు. ఇఁక నొక వితంతువునకు ఏఁబదికి బైఁబడిన వయసు. యువతి నవయౌవనమునఁ దూఁగుచున్నది. పదునెనిమిది సంవత్సరముల యీడు. యువకునితో నున్న ముసలమ్మ—

"ఎక్కణ్ణుంచి వస్తున్నారండీ?" అని వారి నడిగెను. అర్ధాంశము గడపిన చిన్నముసలమ్మ—టిక్కట్లు, చిల్లరడబ్బులు పంచెచెంగున ముడివేసి రొండిని దోపుకొనుచు: "పేరాయ

వదినే, మయాన యిబ్బందిపడుతున్నావు నీవీలాగు చగ్గాసరుదు కొని కూచో— అమ్మన్న దగ్గరగా విశ్రాంతిగాను" అని అమ్మా, మేమా అండీ?— కాకినాడనుంచి " అని జవా బిచ్చెను. అంతలో యువతి పెద్ద ముసలమ్మను జూచి:

"పిన్నీ, నా పుస్తకం ఎక్కడెట్టారు?" అని యడిగెను.

"ఏమోనే మీనత్తాయ నడుగు" అన్నది పేరమ్మ. యువతి స్టేషనువంకకుఁ దొంగి తొంగి చూచుచున్నది. యువకునితోనున్న ముసలమ్మ—

"ఎందాకా అండీ?"

మీనాక్షమ్మ:— "ఎందాకానా?—ఆఁ- నేను వద్దుమొర్రో— మనం నిర్వహించలే మని గోలకెత్తాను—విన్నారా?— శ్రీశైల యాత్రింటూ పెట్టారు. ఏలా వెళ్ళుతామో! ఏలావస్తామో తెలిసిందికాదు—మాయగోల. మనదేశమా మనగోడవా?"

ముస:—"నియ్యోగు లేనాలండీ?"

"ఆఁ—కాస్తంత కొఱంత లేకుండాను."

"సరేలెండి బాగానే కుదిరింది సావాసం-ఇంటిపేరూ?"

"నాపుట్టింటూరు మద్దూరువారు అత్తగారు పాలకోడే టూరు."

"పాలకోడేటివారే!—నాపుట్టింటివారమ్మ"

"మీ అత్తవారెవరండీ?"

"ఎవరైతేనేం—పేరా పెంపా? ఈకుఱ్ఱాడు నా కూతురి కొడుకు"—అని కండ్లనీరు గ్రుక్కుకొనుచు—

"అమ్మా అని పిలిపించుకోటానికైనా దానికి పుణ్ణెం లేకపోయిందమ్మా..." అన్న దా ముసలమ్మ. యువకుఁడు ఇరువదేండ్లు దాఁటినవాఁడు. క్రాపింగులోనుండు పిలక వెళ్ల బడినది. మీసము తీసివేసినాఁడు. వేషము నాగరకతకుఁ దీసి పోలేదు. మాసిన మశూచికపుమచ్చలుండియు ముఖము అందమైనదే. కనుబొమ్మతీరు, కంటివిరివి గలవాఁడు.

యువతి లేతగులాబి పువ్వువలె నున్నది. ఆమెముఖమునకుఁ ఆ అగరుచుక్క, ఆపుష్యరాగాలచంద్రవంకబేసరి చాలును. ఆ చెవులకు కెంపులదుద్దులు రక్తినిఁ గూర్చినవి. ఆ చేతులకు మంగళూరుడైమండ్ కళావర్ గాజులు గుత్తముగా సరిపోయినవి. వలిపపుతెల్లచీరమఱుఁగుననుండి లేఁత ఊదా జాకెట్టు కన్పించుచున్నది; గడియారపుగొలుసు నే నున్నా నని మెఱయుచున్నది; వెన్ను నాశ్రయించి వ్రేలు జాఱుజడ కటి నతిక్రమించినది. ఆమె చూపు స్టేషనునకు బద్ధమయినది.

యువకుఁ డొకడు వాయువేగమున బండిని సమీపించినాఁడు. పెట్టె పెట్టె దగ్గఱకుఁ బోయి తొంగి చూచుచు ముందునకు నడచుచున్నాఁడు. సిగరెట్టు పీల్చుటలోఁ బరాకు పడఁడు. నవనాగరకవేషము పూర్తిగ మూర్తీభవించినది. పాతికె యేండ్లవాఁడు—రూపసి—ఇట్లీతఁడు వెదకుచుఁ గళవళ

పడుచుఁ బోవుచుండ, యువతి యాతనిఁ గనులఁ బడెను. ప్రియ మగు స్థానము వీడ నున్నప్పటి హృదయమువలె బండి అదరి ఒక్క-మాఱు ముందువెనుకలకుఁ దూగెను. యువకుఁడు సత్వరన యువతియున్న పెట్టె కడకుఁ జేరుచు చిఱునగవున "అనుకున్నట్టే వచ్చారే!" అన్నాఁడు.

"ఉత్తర మందలేదే?—" అని ప్రశ్నించినది యువతి.

"అందింది కనుకనే ఆవర్లడుచుకుంటూ పరుగెట్టుకుంటూ వచ్చాను."—

అని, లోపలికిఁ జూపు నిగుడ్చి,

"పిన్నిమాత్రమేనా ? అమ్మమ్మరాలేదే?— ఏమిటీ అత్తయ్యకూడా వస్తున్నదీ!— చెప్పరూ!" మీనాక్షమ్మ, పేరమ్మ—ఇరువురు వికసించిన ముఖములతోఁ కిటికీ వద్దకు వచ్చినారు. మీనాక్షమ్మ తలమీఁది ముసుగు సవరించుకొనుచు—

"ఏమిరా సూర్యనారాయణా, నీవుబయల్దేరవా యేమిటీ ? ఏదీ నీపెట్టె బెడుసులూను? "—అనెను.

"నేను ఎల్లుండి బయలుదేరి వస్తా. మాఆఫీసు ఇన్స్పెక్షను ఇంకా జరుగుతూనే వుంది. రేపటితో ఆఖరు అవవచ్చు. సెలవుకి దరఖాస్తు పంపాను. సిఫారసుచేసి మంజూరు చేయిస్తానన్నాఁడు—మామేనేజరు. మీరు జాగర్తగా వెళ్లండేఁ! దూరాభారము - చలికాలం - వెళ్లేదా కొండ ప్రదేశమూ - అందులో మగతోడు లేదు!"

"ఏమిటి చేయ మన్నావు?—నీవు వస్తా వన్నధిలాసాతో ఈ ప్రయాణం తలపెట్టుకొని బయల్దేరామేకాని—అసలు ఇల్లు వదుల్తా మనుకున్నావుట్రా మగాఁడు లేకుండానూ?— మాయ గోల— ఎన్నడన్నా విడబడి వెళ్లేవారమా ఏమన్నా నా?"

"పోనివ్వండమ్మా— అయింది— బయల్దేరారు— వచ్చారు. ఇం కెందు కా గొడవ ? నేనూ మీతో రావా లని ఉత్సాహ పడ్డాను. సన్నాహంతోనే ఉన్నాను. ఏంజెయ్యను ?— తీరా సమయానికి ఇన్స్పెక్షనంటూ ఇదొకటి తగలడింది ! సరే— అనుకుంటే ప్రయోజనం? ఎల్లా ఐనా ఎల్లుండి బయలుద్దేరటం ఖాయం; అటావలెల్లుండి యేంజేసి మిమ్మల్ని కలుసుకుంటాను గాదూ ! అధవా శివారాత్రినాఁడు పొద్దు పొడిచేవేళకైనా అందుకో లేకపోతానా ?"

"ఏమిటోబాబూ ఏంజేస్తావో ! దాని పుణ్యాన్న మీ నమ్మ రాఁబట్టి సరిపోయింది. లేకుంటే మాఁగ తేమయ్యేది! ఏమిటో దిగుల్దిగులుగావుంది- తప్పేవుసుమీ ఎల్లుండి!"

"ఇదో సూర్యనారాయణా, నిన్ను నమ్ముక వెడు తున్నాం- చిక్కన పడవేయకేఁ! మీ పిన్ని ముసిల్ది; ఇఁక ఇదా దానిమొగం దానికేంపని చేతనౌను? రాగాపోగా ఆడు చాకిరీకి బాడుచాకిరీకి నే,నొక్క-దాన్ని- మాయగోల- వాళ్ల పుణ్యమా అని వారు— మనవారే- శ్రీశైలమే వెడుతున్నారు! వాళ్లకు మేమూ, మాకు వాళ్లూను".

"నా మాటైనా చూతురు! వెళ్ళాలి! ఆఫీసులో కాకితాలన్నీ ఎక్కడి వక్కడే పడేచి, బండి తప్పుతాను కామోసని పరుగున వచ్చాను. బండి కదిలే లాగుంది—కూచోండి—తూలకొడుతుంది: జాగ్రత్త సామానుగట్రి!"—అని యువతినిఁ "జూచి—నీవేమిటే యేదో మోస్తరుగా వున్నావు?"—అని అనునయించి—

"నేను వస్తాగాదూ?—అలాంటి పిచ్చి పిచ్చి పన్లు జరుగనిస్తా ననుకున్నావుటే వెఱ్ఱిదానా! బెంగెట్టుకోకు!"—అని యోదార్చుచుండఁగా రెండవమాఱు గంటకొట్టినారు. గార్డు కుడిచేత ఈలవేయుచు ఎడమచేత ఆకుపసరు బావుటా విసరినాఁడు; దిక్కులు పిక్కటిలునట్లు 'కుహూ' యని కేకవైచి బండికదలెను.

"అమ్మా, నే నాగుతాను"—అన్నాఁడు సూర్యనారాయణ.

"తప్పక రావాలి సుమీ!"— అని ఉచ్చైస్స్వరమున ముసలమ్మలు బలికిరి. అంతకంతకు బండినడక నడికాఁజొచ్చెను. ఉవిద కిటికీలోనుండి చూపున కందు నందాఁక సూర్యనారాయణను జూచుచు పయంటచెఱఁగుతోఁ గన్నీరు తుడుచుకొనుచుండెను. తిరిగి చూచునంతలో శకటము కృష్ణానది వంతెన మీఁద నడచుచుండెను. ఆశకటగమనధ్వానమున ప్రయాణికుల మాటలు క్రమక్రమముగా మునిఁగిపోయినవి. వేణికలుగట్టి శాంతముగ నిర్మలవృత్తితో తాపసివలె గమ్యమునకై ప్రవహించుచున్నది కృష్ణవేణి. కొన్ని నిమిషములలో వంతెన గడచినది. తాడేపల్లి స్టేషను చేరినది.

## ౨. ప్రకరణము.

బండి తాడేపల్లి వదలినది. తొలుత మనకుఁ బరిచితమైన పెట్టెలోని ఆ బ్రాహ్మణయువకుఁడు తఱచుఁ దనివోవక యువతినిఁ జూచుచున్నాఁడు. ఇతరులు తన్నుఁ గూర్చి ఏ మనుకుందురో యని కాఁబోలు అప్పు డప్పుడు తల మలఁచి కిటికీలలో నుండి బయలు చూచువాఁడు. ఆయువతి యందలి అనిర్వాచ్యమైన గుణ మేదియో ఆతనిహృదయము నాకర్షించె నని ఆకనులు తెలుపుచున్నవి. ఆగుణ మేదియో ఆతని చిత్తము నడుగవలయును. తారుణ్యమున సౌందర్యము, మధుర వీక్షణములలో మాధుర్యము, వచస్సున విపంచికారవము కాపురము చేయుచున్నవి. అట్టి యీ ముద్దరాలి విలాస మేవాని నాకర్షింపదు? ఒకొకప్పుడు పరస్త్రీనిఁ జూడఁగూడ దని ఆతఁడు తన చూపులను బలవంతముగ వెనుకకు లాగుచున్నాఁడు. అధరస్పందనమునుబట్టి యాతని మనస్సునఁ బొరలు తలంపులు తెలియ నగుచుండెను. ఆతని దృష్టి, తన చదువు గ్రంథముపై వైముఖ్యము చూపినది. నిర్వ్యాపారముగఁ బ్రొద్దుపుచ్చనేరక తోడిప్రయాణికులతో, గొంతవడి లోకాభిరామాయణమును సాగించినాఁడు. కాని మానసిక స్వభావము నెట్లు మఱల్పఁ గలఁడు? కటాక్షములు మాత్రము దొంగపోటునఁ దటాలున ఆగమణివిలాసములం జుట్టివచ్చుచుండెడివి. ఉన్నట్టుండి ఆతనికనులలో విద్యోతమాన మగుచుం

డిన కళిక ఆఱిపోయినది. రాహువు చంద్రునిం బలె,-ఖేద మేదియో ఆతని నెమ్మదిం జొచ్చి మోదమును హరించి వైచినది. ఆతని ఈ హఠాత్క్లేశమునకుం గత మేమో !

ఆ చెలువ మనసులోని దైన్యము కనులనుండి తొంగి చూచినది. ఆతని మనస్తాపమున కిది చాలదా కారణము? బెజవాడ స్టేషనులో నీ సుందరి నూరార్చిన యువకుం డెవండు! ఈమె కాతం డెట్టి బంధువు! ఈమె నావరించినదీనత కేది హేతువు!-ఇట్టి శంకాతంకములచేం బీడింపం బడు చున్నాండు ఆ యువకుండు. తొలుత ఆయువిదను గాంచినపు డాతనిలో నుదయించిన శృంగార భావము ఇపుడు కరంగి కారుణ్యమయి నది. లోన యురియాట తప్పదు. మౌనమే శరణ్యమైన దాత నికి. ఐహికవర్తకులకు మౌనమునుమిగిలిన కఠినదండనము లేదు.

౧౧-౪౫ నిమిషములకు బండిగుంటూరు స్టేషను జేరినది. 'కమలాఫలామ్' అని యొకండు, 'చుట్టా బీడీ సిగరేట్' అని మఱియొకండు, 'పాల్ పాలు' అని గొల్లభామ యొకతెయు, 'సోడా లెమ్నేడ్' అని ఇంకొకండును, 'బూందీ పకోడీ కారప్పూసా జిలేబీ లాడూ బర్ఫీ పేడా' అని గుజరాతీయుండును, 'మంచినీళ్ళు మంచినీళ్ళూ' అని బాపనయ్యయు ప్లాట్ ఫారముమీంద బండి-పొడవున ఇటు నటు కేకలిడుచుం దిరుగు చుండిరి. దిగెడువారు దిగుచుండంగనే ఎగబడి ఎదురెక్కు-

చున్నారు కొందఱు; స్థలములేదని బండిలోనివా రదలింపఁ గోపగించి వారితో మెడపట్లకు తలబడ నున్నారు కొందఱు; కారఫ్ఫ్వాసకై ఏడ్చుచుండు కుఱ్ఱవాఁడు బుజముమీఁద నున్నాఁడు—సందిళ్ళమూటలు జాఱి పోవుచున్నవి. చంటిబిడ్డతో భార్య నడవలేక దూరమున వచ్చుచున్నది; తావు దొరకక తత్తరపడుచు వెనుక నున్న భార్యకై తిరిగి తిరిగి చూచుచు వడి వడిగఁ బోవు చున్నాడు గృహస్థొకఁడు. రైలుబ్యాగు కుడిచేతఁ బట్టుకున్నాఁడు—ఎడమచేత కఱ్ఱతోఁ గూడ న్యూసుపేపరు మడుపు పట్టుకున్నాఁడు—జేబులో మనీపర్సు కానఁబడక తెల్లకన్నులు వేసి, వెదకిన జేబులలోనే వెదకుచు, క్రింద నెక్కడనైనఁ బడియుండునా యని వచ్చిన త్రోవను నెమ్మదిగ నేల చూపులు చూచున్నాఁడు—నర్సారావుపేట ప్లీడరు కాఁబోలు! జేబులు తడువుకొని టిక్కెట్టు కనఁబడక తికమకలఁ బడుచు, డబ్బు లిచ్చి అడావుడిలో టిక్కెట్టు పుచ్చుకోకయే మఱచి వచ్చితి నని జ్ఞప్తి తెచ్చుకొని తన తెలివిని నిందించుకొనుచు ఒడిసెటిరాయి వలె మరల మేస్టరుగారి వద్దికిఁ బరువెత్తినాఁడు రైతు ప్రయాణికుఁ డొకఁడు.—సామాను పట్టించుకొని గేటుదాఁటిపోయి మఱచెంబు మఱచితి నని మరలి తొందర తొందరగ వచ్చి తన మొదట గూర్చుండిన పెట్టెఁ గనుగొనలేక పెట్టె పెట్టె వద్దికిఁ బోయి లోనికి బాఱ జూచుచున్నాఁడు పంతు లొకఁడు—ఇట్లు స్టేషణ్

ప్లాట్‌ఫారమంతయు గందరగోళముగానున్నది. గంటకొట్టినారు. గార్డు ఈలవేసి ఆకుపచ్చ జండా వీచినాఁడు. ఆఱు గంటలైనవి. సందె చీఁకటి వ్యాపించినది. దీపములు వెలిఁగినవి. ఇంతలో పెద్దమనుష్యుల విశ్రాంతికిఁగా నేర్పడిన గది ( Gentlemen's Waiting Room)లో నుండి అతివేగముగ యువకు లిరువురు వెలువడి బండినిఁ జేరిరి- బండి కేక వేసి కదలినది- తటాలున వా రొకపెట్టెలోఁ బడిరి.

ఈ యిరువు రెక్కినపెట్టె మనకథకుఁ బ్రధానస్థలమే. ఈ క్రొత్తయువకు లిరువు రొకచోటనే కూర్చుండిరి, వారిచే నొక తోలుబాగుతప్ప నితర సామానులేదు. మన పూర్వపరిచితుఁడగు యువకునితోఁ బ్రయాణముసేయుచున్న ముసలమ్మ-

"రంగారావ్, పై బేసనులో కాస్త నన్నుదించాలి"-అన్నది.

"ఆలానేలే అమ్మమ్మ" అని, రంగరావు, క్రొత్త యువకులవంకఁ దిరిగి— "ఎందాక వెడుతున్నారు?"— అని ప్రశ్నించెను.

అందుఁ బెద్దయువకుఁడు— "చాలాదూరమండి"— అన్నాడు. ఆయిద్దఱిలో నొకఁడు ముప్పది యేండ్ల వయసు వాఁడు; రెండవవాఁడు పాతికేండ్లకు లోఁబడినవాఁడు. పెద్ద వాఁడు ముదురుబాఱినవాఁడు, పౌరుషముగల ముఖము- ఆ క్రాఁపు, ఆ మీసకట్టు, ఆ సిల్కు జుబ్బా, ఆ సేలంజరీ పట్టు

ఖాండనా, ఆ గ్లాసుగో మల్లుపంచె, ఆ మణికట్టుగడియారము నవనాగరకతను మొగముమీఁద జలుచుచున్నవి. చిన్నవాఁడు రూప వంతులలో లెక్కింపఁ దగినవాఁడు- సిగ్గరి- నింపైన తలకట్టు- నాటకాలలో స్త్రీవేషధారణమున కలవడినవాడుగ నున్నాఁడు. కోటుతో టోపీ ధరించినాఁడు.

పెద్దవాఁడు ఫరాఖత్తుగ సిసర్ సిగరెట్టు కాల్చుచు, నాటకాలలోని పద్యాలు కూనురాగములతోఁ దనలోఁ బాడు కొనుచున్నాఁడు.

హృదయవీథినిఁ ద్రోపులాడుచున్న భావములకు సూచికగా రంగరావు నోర శ్లోక మొకటి రాగయుక్తముగ మంద్రస్థాయిలో వెలువడినది. పెద్దయువకుఁడు రంగరావున కభిముఖుఁడై- "దయచేసి ఆపద్యం కాస్త బిగ్గఱఁగా సెలవి య్యరూ?" అని సవినయముగఁ గోరెను.

రంగారావు:—"చిత్తమాలాగేనండి" అని తలయూచుచు, కాళి దాసు శాకుంతల నాటకంలోనిది ఈ శ్లోకం; కణ్వాశ్రమంలో తొట్టతొలిగా శకుంతలను చూడఁగానే దుష్యంతుఁడు చెప్పింది. 'ఉపమాకాళిదాసస్య' అన్నారు పెద్దలు. స్వభావాన్ని ఉపమించి చెబితే వాఁడే చెప్పాలి. చిత్తగించండి, ఆసరసం:

'సరసిజ మనువిద్ధమ్ శైవలేనాపి రమ్యమ్,
మలినపి హింమాంశో ర్లక్ష్మ లక్ష్మీం తనోతి

ఇయ మధిక మనోజ్ఞా వల్కలేనాపి తన్వీ,
కిమివహి మధురాణామ్ మణ్డనమ్ నాకృతీనామ్,

శకుంతల, అనసూయా ప్రియంవదలతో ఆశ్రమం లో పెంచుతూవున్న పూలమొక్కలకి నీళ్ళు పోస్తూవుండఁగా దుష్యంతుఁడు చూచి ఆమె కట్టివున్న నారచీరనున్ను ఆమె శరీరలావణ్యాన్నిన్నీ వర్ణించాఁడఁట!''

"తామ సంస్కృతం బాగా చదువు కున్నట్లుతోస్తుంది. ఇంగ్లీషు ఎంతవఱకు చదివారో!"— అన్నాడు పెద్ద వాఁడు.

'నాకు సంస్కృతపరిచయం తక్కువ; లే దని చెప్పినా చెప్పొచ్చు. ఏమిటో చెప్పఁగా విన్నవి కొన్ని శ్లోకాలు వస్తవి. ఇఁక నా చదువును గుఱించి: బి. ఏ పరీక్షకు నిరుడు వెళ్ళాను. ఫలించిందికాదు. హిస్టరీలో పోయింది. ఇంతలో జబ్బుకూడా చేసింది. అంచేత వచ్చేయేఁడు మరల పరీక్షకు వెళ్లఁదలచుకున్నాను. ఏమిటో ఈ చదువులూ ఈపరీక్షలూ వట్టి వేలం వెఱ్ఱి కింద తయారయ్యాయి. బి. ఏ ఐందయ్య- ఆనక? ఏ ఆఫీసులో ఉద్యోగం దొరుకుతుందా అని ఆఫీసర్ల కొంపల చుట్టూ ప్రదక్షిణాలు చెయ్యాలి. అంతేనా? సిఫారసులు కావాలి—ఒక సిఫారసులేమిటి! ఎన్నో హంగులు చెయ్యాలి. చివరకి బ్రాహ్మడన్న అయోగ్యత ఒకటి అడ్డొస్తుంది. దాంతో ఆప్రయత్నం విఫలమౌతుంది. తిరిగీ రెండేండ్లు ఏలాకాలేజీ

లోనో, ఐదేండ్లు ఏమెడికల్ కాలేజీలోనో దండయాత్రలు సాగించాలి. ప్లీడరీపరీక్ష ఐం దనుకోండి; కేసులు వస్తేకదా వీడికి ఆదాయం. ఇప్పుడున్న ప్లీడర్ల పాట్లు మనం చూట్టంలా? ఇఁక డాక్టరీ పరీక్షప్యాసైంది — ఉద్యోగాపేక్ష లేదుగదా? మందులకీ కొంప అద్దెకీ ముందుగా పెట్టుబడి కావాలి. ఈ చదువుకే ఆస్తి అమ్మి అప్పులపాలై లకలుకలుగా వుండే వాడికి పెట్టుపడి ఎక్కణ్ణుంచి వస్తుంది? పోనీ పెట్టుబడి దొరికింది—హాస్త వాసికావాలి—అదృష్టంపట్టాలి. కాదంటారు?—ఇంజనీరింగుకీ వెళ్ళాము—ప్యాసై నాము—ఆతర్వాత?—ఉద్యోగ మేది?—సర్కారు వాళ్ళు మాత్రం ఎందరికని ఇస్తారు వుద్యోగాలు? ఎన్నని సృష్టిస్తారు? స్వతంత్రంగా బదకటానికి తెలియదు మనకి. మన ఇప్పటి చదువులన్నీ ఉద్యోగాల కోసమేకాదా? అదేపరమావధి--ఎందుకులేండి ఆగొడవ?"

"బాబూ, ఆశ్లోకానికి అర్థం సెలవియ్యరూ?

"ఎందుకూ శాకుంతల నాటకాని కున్నాయి తర్జుమాలు చాలాను."

"నా కంతమాత్రం విద్య అబ్బింది కాదండి"

"ఐతే వినండి—తెలుఁగు పద్యం చదువుతాను-వేదం వెంకటా్రియశాస్త్రుర్లవారి తర్జుమా

"కమలము శైవలావృత్తికిఁ గాంతిఁ దొఱంగక తేజమే గనుఁ,

హిమకరమండలంబు సిరినే బొరయుఁ మలినాంకయుక్తిచే

రమణవహించు నీసతియు రట్టడి వల్కలమే ధరించియుఀ
సుమధుర మోహనాంగులకుఁ జొప్పడుభూషణ మేది
కాదొకో!"

శాస్త్రీయముగాఁ బాడి విపులముగ అర్థముగూడఁ జెప్పి
నాఁడు రంగరావు.

"మఱొక శ్లోకం సెలవియ్యరూ?"

'అలానే వినండి ఏలాగో కాలక్షేపం కావాలిగదా?
అనాఘ్రాతమ్ పుష్పమ్, కిసలయ మలూనమ్ కరరుహైః,
అనావిద్ధమ్ రత్నమ్, మధునవ మనాస్వాదితరసమ్
అఖణ్డమ్ పుణ్యానామ్ ఫల మివ చ తద్రూప మనఘమ్
నజానే భోక్తారమ్ కిమివహిసముపస్థాస్యతి విధిః?

దీనికి ఆ శాస్త్రుల్లవారి తెనుఁగు:

'ఆనని తావిపూవు, నఖరాగ్రము సోకనిపల్లవంబు, క్రొం
దేనెరసంబుఁ గ్రోలనిది, తీరయి విద్ధముగాని రత్నముఀ
మానినిరూపు-పుణ్యభరమంజుఫలం బనఘంబఖండముఀ;-
నేనెఱుఁగఀ విరించి యెవనిం బరిభోక్తనుగూర్పనెంచెనో!'

దీనికిని రంగరావు అర్థము చక్కగానే చెప్పినాఁడు. అర్థ
ము చెప్పినపద్ధతిని, పద్యము చదివిన ఫక్కికను వినఁగా తెలుఁగు
నందు ప్రవేశము గలవాఁ డని, సంస్కృతమునను కొంత
పరిచయము గలిగించు కొన్నాఁ డని తోఁచుపడినది. ఆతని

ప్రసంగము అక్కడివారలకుఁ గొందఱకు ముఖములు వికసింపఁ జేసినది. అర్థమైనను కాకున్నను అందఱును సాభిలాషముగ వినుచున్నారు; శిరఃకంపనములును జేయుచున్నారు; కాళిదాసు వరకవి అని, సరస్వతీదేవియవతారమే యని కొనియాడు చున్నారు. తరుణి, బల్ల క్రిందిమూట ఒకటి బయటికిలాగి, అందుఁ జేయిడి తీసినది పుస్తకము నొకదానిని—అది 'ప్రణయమధురిమ' నవల. ఆ పుస్తకప్రకరణమునఁ దన దృష్టిని లగ్నము చేసినది. దొనకొండ చేరునప్పటికి బండిలోని వారు కొందఱు సరుదు కొని పరుండినారు. కడమవారిలోఁ గొందఱు నిద్రావిష్టులై కునికిపాట్లుపడుచున్నారు. అమ్మాయి చదువు కొనుచునే యున్నది. రంగరావు పక్కచుట్టకుఁ జేరగిలఁబడి పై దీపము జూచుచు కనులు మూసికొనుచు కాలము బుచ్చుచున్నాఁడు.

రాత్రి ౨ గంటలకు బండి మార్కాపురము రోడ్డు చేరినది. రంగరావు, అందఱను దించి, సామానంతయుఁ గ్రింది కందించి దిగినాఁడు. యువతి రెండుమూఁడు సామాను లందు కొన్నది. రైలును కూతవైచి కదలినది. కూలివాండ్రచే సామాను మోయించుకొని ముసలమ్మను వెంటఁగొని స్టేషను వద్దిసత్రము చేర్చినాఁడు రంగరావు. అందఱు తల కొకచోఁ బక్కలు పఱచుకొని పరుండిరి.

---

*

# 3. ప్రకరణము.

కడచినరాత్రి మార్కాపురము సత్రములో విడిసిన రంగరాయాదులు ఉదయము భోజనాదికములం దీర్చికొని రెండెడ్లబండిలో బయలుదేఱిరి. రెండున్నర ఆమడ వఱకు నడుమ నడుమ మొకాములతోఁ బయనము అంతకష్ట మని పించినదికాదు. ఆపై మార్గము విషమ మగుట శ్రమసంకటము లు అనివార్యములైనవి. ఆమడకుఁ బైన ఇఱుకుగొందులు-- వెదురు బలుస రేగు పొదలు— వీనినడుమ కాలిదారి. రంగ రావు, అమ్మమ్మను సామానుసహితముగా డోలిలోఁ బంపి నాఁడు. యువతియు, పేరమ్మయు నడవలే మని డోలీలోఁ గూర్చుని వెళ్ళినారు. మీనాక్షమ్మ మాత్రము-- "దేముఁ డిచ్చినకాళ్లుండఁగా డోలీలో వెళ్ళటమేమి గ్రహచారమ్! నడుస్తూవుంటే ఆ మల్లికార్జునుఁడే లా క్కెళ్లుతాఁడు. ఆరం భారం వాడిమీఁదే వేశామ్. ఇంతదూరం రప్పించుకున్న వాఁడు కొం డెక్కించుకో లేఁడూ! సందెవేళ కన్నా చేరలేక పోతా మేమో చూదామ్ నడవండి"—

అని హాఠముతో భక్తిని, భక్తితో సాహసమును పురి వెట్టి నడక సాగించినది. రంగరావు పర్వతప్రాంత మందలి వివిధస్థలముల రామణీయకతలవైపునకు దృష్టి బఱపుచుఁ బోయెను. వందలకొలఁది యాత్రికులు 'మహాదేవ' సంబో

ధనలతో నెక్కుచున్నారు. ఆ భక్త్యావేశమున వారికిఁ గష్టము దోఁపదు. వీరు కైలాసద్వారము జేరునప్పటికి పొద్దు ఏటవాలి నది. అచటఁ గొంత విశ్రమించి ముందున కేఁగిరి. ఈకైలాస ద్వారమునుండి శ్రీశైలశిఖరము జూచినవారికి జన్మము ఉండ దని లోకసామాన్యమునమ్మిక. ఇచటనుండి వక్రాకృతిం గన్పడు కృష్ణవేణిని రంగరావు కుతూహలమునఁ గాంచినాఁడు. అటఁ గడచి పోవుచుండ దారిలో చిన్నగుడి యొకటి యగ పడినది. పొర్లెత్తి వచ్చు యాత్రికప్రవాహము లట నాగు చున్నవి. మీనాక్షమ్మ వెనుకఁ బడినది. ఆమె రాకకు ఎదురు చూచుచు అచట నొక మచ్చుతాతిమీఁదఁ గూర్చున్నాఁడు రంగరావు. యాత్రికు లెల్ల ఆగుడివద్ద ఆగి తమతమ పేళ్ళను జెప్పి ముందున కరుగుచున్నారు. ఆచోటనున్న ఒక మనిసినిఁ జూచి ఇ దేమని రంగరావు ప్రశ్నించినాఁడు.

ఇది సాక్షిగణపతిగుడి యని, యాత్రికులు తమపేర్ల నిక్కడ చెప్పి పోవునెడల ఈయన నమోదు చేసికొను నని— అచటియాచారము అతఁడు తెలిపెను. మీనాక్షమ్మయు అందుకున్నది. ఆగుడివద్ద ఆనవాయతి చెల్లించినది. సూర్యాస్త మయ వేళకు రంగరావు, మీనాక్షమ్మయు దేవాలయ ముఖద్వారమున నడుగిడఁ గలిగిరి. యువతియు, ముసలమ్మ లిరువురును సామానుతో నొకమండపమునఁ గూర్చున్నారు. మండపమునకు సమ్మార్జనసంస్కార మైనది. ప్రాకారము వెలు

పలి కోనేటిగట్టున, తుగిడీలుగ వెళ్ళి, స్నానములు చేసిరి. స్వామిదర్శన మబ్బినది. అకాలమగుటచే వంటవార్ుల కనువు పడ దనుకున్నారు. క్షేత్రోపవాస ఫలితము దక్కినదని మన స్సునకు సమాధానము జెప్పికొన్నారు. ముసలమ్మలమూటల లోని అడుకులతో మినుపసున్నితో ఆరాత్రిగడపినారు. అందు వారందఱు ఆమండపముననే ముసురుకున్నారు.

రంగరావు ఎదుటి మండపమునఁ బక్కవేసికొ న్నాఁడు. ప్రయాణాయాసమున బడలినాఁడు—కాని నిద్ర పట్టదు. మాటిమాటికి లేచి కూర్చుండు చున్నాడు. క్రొత్తచోట నిదురపట్టనివారు కొందఱు. పుస్తకము చేత నున్నఁగాని నిదురరానివారు కొందఱు. ప్రయాణములలో నిద్రపోనివా రొకకొందఱు. తెంపులేని యాలోచనలలో మునింగిన వారిని, దొంగలను, చీఁకటిపార్వేటగాండ్రను, పైత్యరోగులను, పరవంచకులను, ధనికులను, జూదగాండ్రను, దుర్వ్యాజ్యగాండ్రను—నిద్రాదేవత తేటిపైనెనఁ జూడదు.

రంగరాయని నిద్రితకుఁ గారణ మేమో!

అప్పు డప్పుడు విడుచు నాతని యుచ్ఛ్వాసములలో నేదేని మనస్తాపమున కగ్గమైనజాడ కన్పట్టుచున్నది. ఆతని జాగరముతోఁ దెల్లవాతెను. గాఢతమోనిమగ్నమైన జగత్తు క్రమక్రమముగఁ బయికిఁ దేలుకొనుచున్నది. అదృష్టము దృష్ట మైనది. అబోధము సుబోధమైనది. భయావహప్రపంచము

సమ్మోదావహ మయినది. అంధునకు దృష్టి కలిగినది. బధిరు నకు శ్రవణభాగ్య మొదవినది. మూఁగ ముచ్చటలాడఁ దొడఁ గెను. సుషుప్తి స్వప్నప్రపంచముం గడచి జాగృతమైనది. పామరుఁడు ప్రాజ్ఞుఁడైనాఁడు. ప్రకృతిజనని, ఒక్క మాఱు శైశవక్రీడలఁ దలపించి; లోకజాలముపై నిజమందస్మితకటాక్షములం బఱపినది.

లోకబాంధవుని ప్రయాణ మారంభమైనది. రంగరావు, బసకు వంటకు ననుకూల మగు మండపము నొకదాని నేర్పఱచినాఁడు. ఆఁడువారి నందఱ నటఁ జేర్చి కొఱఁతగా నున్న ఉప్పుపప్పులను కాయగూరలను వంటచెఱకును తేఁ బోయినాఁడు. ఆతనికి మఱలి వచ్చునప్పటికి ఇంట నెవరును గాన్పింపరు. లోనికి వెళ్ళినాఁడు. యువతి యొకమూల ట్రంకు మీఁద నొరగఁబడి కన్నీరు నించుచున్నట్టు చూచినాఁడు. ఆ యమ్మాయి చూపులందలి చుఱుకుఁదన మొత్తిగిలినది. డాఁగురుమూత లాడుచుండిన సహజలావణ్య మా ముఖ మునకుఁ బరాఙ్ముఖమైనది. ఆ శోకమూర్తినిఁ జూచి రంగ రావు నిలువున నీరైనాఁడు. ఉపేక్ష పైకొనుటచేఁ గాఁబోలు ఆతఁ డించుక ఔదాసీన్యము వహింపవలయు వాఁ డయ్యెను. కాని మనస్సు వెనుకకు లాగినది. ఇంట మఱెవ్వరు లేరని మెఱఁగియు అమ్మాయినిఁ బలుకరించు తలంపునఁ గాఁబోలు 'అమ్మమ్మా' అని పిలిచినాఁడు—గద్గదికముగ. 'స్నానానికి

వెళ్ళారు' అన్నది ఆ యమ్మాయి మెల్లగ. అదివఱ కెన్నఁడు ఆమెతో మాటలాడినాఁడు గాఁడు రంగరావు. ఇపుడు నిబ్బరము చేసికొని ఏదే నడుగ నుంకించి తలయెత్తకయే- ఏమియుఁ దోఁపక ఖండువా చివరచెఱఁగు మెలివెట్టుచు: 'ఎంతసే పైందమ్మా?' అన్నాఁడు- కాని కంఠధ్వనియందు వడఁకు తప్పలేదు. 'మీ రలా వెళ్ళిన కాస్సేపటికే నండీ' అన్న దాయమ. మఱేదియో అడుగఁ దలంచి నాఁడు. అంతలో నేమితోఁచినదో మిన్నక తలయూఁచి- 'సరే'- అని వెలుపలికి మఱలెను. తడిబట్టలతో, సందిళ్ళ నీళ్ళబిందెలతో ముసలమ్మలు ముగ్వురు వచ్చినారు. అమ్మాయి మనస్తాపకారణ మారయుట కిఁక రంగరావున కవకాశ మెక్కడ? ఆతనిమనస్సునఁ జెప్పరాని సంఘర్షణము పెనఁగొన్నది. ఎవరితోఁ దలపోసికొనుట! వ్యాకులత కుతూహలము ఉఱ్ఱూఁతలూఁచు చున్నవి. సహనము సహజ మగుట అదనునకు [1]వార్చి యుండవలయు వాఁడయ్యెను.

మధ్యాహ్నము భోజనములైనవి. విశ్రాంతియుఁ గొంత గలిగినది. కర్నూలునుండివచ్చి అటసమీపమున నొకమండపమున బసచేసియున్న బ్రాహ్మణకుటుంబముతో యువతికిఁ బరిచయ మొదవినది. వారిలో నొకపడుచున్నది. ఆ పడుచునకును మన యమ్మాయికిని ఈడుజోడు కుదిరినది; నేస్తము

---

1=ప్రతీక్షించి

కలిసినది. యువతి ఆకర్ణ్యాలువారి విడిదికిఁ బోయినది. రంగ రావు యాత్రికుల నెల్లఁ బాఱజూచుటకు దేవాలయమున నాల్గుమూలలు దిరుగఁ బోయినాఁడు. యాత్రిక బ్రాహ్మణులు వంటలు చేసికొను చోట్లకుఁ గట్టియున్న తెరలఁ జూచి: మహా క్షేత్రయాత్రలోఁ గూడ మఱుఁగుబాట్లు తప్పలేదా అని వింత పాటుగాఁబోలు అతఁడు ఓరగంటఁజూచి తలపంకించినాఁడు. మఱి యొకచో మడిబట్ట లాఱఁగట్టి శూద్రుల నీవైపునకు రాఁ గూడ దని శాసించు బ్రాహ్మణపూర్వసువాసినిం గని: మహేశ్వర సాన్నిధ్యమునఁగూడ నీ యనర్థాచారపిశాచము తొలఁగదా అని వెక్కసపాటుగాఁబోలు ఆతఁడు చుఱచుఱఁ జూచెను. మఱొక్కెడ తడికొల్లాయితో విభూతితిర్యక్పుండ్ర ములతో రుద్రాక్షతావళములతోఁ బంచపాత్ర ముందుంచు కొని ప్రాణాయామము చేయుచుండిన శాస్త్రిలు, దప్పిగొని దాహ మడుగ వచ్చిన కుంటిబిచ్చుకత్తెను కోపావేశమున గ్రుడ్లెఱ్ఱజేసి గసరి గద్దించి కొట్టుటకు లేచుటగాంచి: దయావిర హితత్వముగూడ బ్రాహ్మణ్యమా అని యాకులపాటు గాఁ బోలు ఆతఁడు నిరసనదృష్టులం జిమ్మి ముందున కేఁగెను. అప రాహ్ణవేళ గుంపెడుపిల్లలతో గుప్పెడుమెతుకులకు గుమ్మము వద్దికివచ్చిన గ్రుడ్డిముండను తఱుమఁగొట్టుచున్న బ్రాహ్మణ గృహిణిదౌర్జన్యము నుపలక్షించి: 'అభ్యాగతస్స్వయమ్ విష్ణుః, అనిన ఆర్యగృహస్థధర్మము మఱుఁగుపడినదికదా

అని వగపుఁగాబోలు ఆతఁడు పెదవివిఱిచినాఁడు. ఎనిమి దేండ్ల బాలవధువుపై అఱువదేండ్ల ముసలిమగఁడు చెలా యించు నధికారనిరంకుశతం గని: ఇది హిందూవివాహధర్మ సముద్ధరణమా యని వెగటు కాఁబోలు ముక్కు చిట్లించెను. పదేండ్ల బాలవితంతుముండితశిరముంజూచి: పూర్వాచార పరిరక్షణమున కిది నిదర్శనమా యని కనికరముకాఁబోలు కన్నీరు తుడుచుకొన్నాఁడు. ఆఱేండ్ల వధువు తొమ్మిదేండ్ల వరుఁడును పంచదారచిలుకలు కొని తినుచు వచ్చుచుండుట గాంచి: ఆర్యదాంపత్యసంప్రదాయమున కిది మచ్చు అగునా యని విచారముకాఁబోలు తేఱచూపులఁ బరికించెను. పేకా టలోఁబడి మైమఱచిన జూదగాండ్రను గని: ఈ దివ్యస్థలమున వీరి కింతకన్న కాలక్షేపమునకుఁ దగిన వ్యాపార మేదియు దొరకదా అని కొందలపాటు గాఁబోలు ఆతఁడు చప్పరించెను. ప్రయాణపు బడలికలచే సత్రములలోఁ దిని స్వస్థతగ నిద్రించు చున్నారు కొందఱు. కొంద ఱింకను పాకప్రసక్తియుం దే యున్నారు.

ఇట్లు నలువైపులఁ దిరిగి శివాజీగోపురము చెంత కరు గుచు అయ్యరుగారి కాఫీహోటల్ ప్రక్కగోడమీఁద "అమృతాంజనము అన్నినొప్పులకు సిద్ధౌషధము" అనివ్రాయఁ బడిన పెద్దఅక్షరములప్రకటనఁ జూచి: మహాగహ్వరాంతర మందలి మల్లికేశ్వరుని కొండనుగూడ విడువలేదే యని

అచ్చెరుపాటు గాంబోలు ఆతని కనుబొమ లూర్ధ్వమున కెగసి నివి. రంగరావు శివాజీగోపురము కడఁ జేరినాఁడు. ఆగోడకుఁ జెక్కఁబడిన బొమ్మలయందలి ప్రాచీనభారతశిల్పమును శాంతదృష్టితో నిదానముగఁ దిలకించి: నేఁటి తత్కృశావస్థకు మనసు కలఁతవడెను గాంబోలు ఆతఁ డొక్క వేడినిట్టూర్పు బుచ్చినాఁడు. ఈ గోపురమునకు 'శివాజీగోపుర' మని పే రెట్లువచ్చియుండు నని సందేహ ముదయించెను గాంబోలు ఆలోచనాతత్పరుఁడై ముందు వెనుకలకు అడుగు లిడినాఁడు. అచ్చోటువాసి దేవాలయావరణమందలి 'అంబ' గుడిని దరిసినాఁడు. అటఁ బోయిన యాత్రికులకు 'అంబ'నుగూర్చిన కథ చెప్పుచున్నాఁ డొకఁడు—గ్రామ్యుఁడు-

"మల్లేస్వరుడు మైసూర్ దేశం బో యుండె నంట సూడి-ఆడ ఈయమ్మవార్ని సూసి వల్సినాఁ డంట! వా యమను తెచ్చుకోని ఈడ పెట్టుకో నుండాడంట సూడి. యేటా ఉగాదిపండగముఁటి పున్నముదాకా ఈడ [1] తిర్నాల సాగుతుంది."

"అదే నంటన్నా [2]మిరాలపున్న మనేది ?"

"మరేమనుకుండావు? అప్పట్లో మైసూరు రాజ్యెంనుంచి [3]అలివిగానిమంది వస్తారు సూడి— ఇన్నావా!— మిరాలూ యాలకులూ ఏంటేంటివో [4]పసార ంగటిదినుసులూ తెస్తారు.

---

1. 'తిరునాళ్లు'—తీర్థము పర్యాయము. 2. మిరియాల పున్నమ. 3. అలవికాని- 4. పచారీదుకాణపు...

స్వాం[1]మీాన [2]అలిగింతకాల అమ్మవారికి తలనొప్పెత్తుతుందంట! [3]ఆమిరాలూ అందూ నూరి అమ్మవారికి [4]పట్టేస్తారు. ఆమోా యిన [5]కోల్లనీ గొఱ్ఱెల్నీ అందూ బలిస్తారు సూడి."

ఈకథ విని: మనవారి నింకను ఇట్టిపిచ్చినమ్మకములు పీడించుచునే యున్నవిగదా యని జాలిపాటుకాఁబోలు ఆతఁడు తనలో హాస్యపునవ్వు నవ్వుకున్నాఁడు. అందుండి బయలుదేఱి లిన్నఁగా ఉత్తరకోణముననున్న వీరభద్రాలయమును సమీాపించెను. అందు లింగాయతస్వామి వృద్ధు వసించుచున్నాఁడు. అప్పటికాయన పాతికసంవత్సరములనుండి ఇచట వసించుచున్నాఁడు. ఆయన శాంతత నిస్పృహత రంగరావు నాకర్షించినవి. ఆతఁ డటకుఁ బోయి కూర్చుండెను. తొల్లి శ్రీనాథుఁడు శివరాత్రిమహోత్సవమునకు ఈ శ్రీశైలమునకు వచ్చె నని, 'శాంతిభిక్షావృత్తు' లనఁ బరఁగిన జంగమపీఠాధిపతు లాతని నాదరించి మల్లికార్జునుని ముఖమండపమున సభ గావించి సమ్మానించి రని, వారికోరిక ననుసరించి తచ్ఛిష్యునకు శాంతయ్యకు 'శివరాత్రిమహాత్మ్యము' రచించి కృతి యొసంగె నని చదివిన విషయము రంగరావునకు స్మృతికి వచ్చినది.—ఎవరి నడుగుట! కొంతసేపటికి ఒకయువకుఁడు బిరబిరవచ్చి రంగరావుప్రక్కనఁ గూర్చుండి, గడ్డమున కెడమచేయి యూతమిచ్చి

1. మీాఁద. 2. అలుగుటచే. 3. ఆ మిరియాలు అన్నియు. 4. పట్టువేస్తారు. 5. కోళ్లనూ గొఱ్ఱెలనూ.

ఆస్వామిని జూచుచున్నాఁడు. సవయస్కుఁడు నాగరకుఁడు తనకుఁ గాలక్షేపమున కొకఁడు దొరకెనని రంగారావు సంతసించెను.

వారు పరస్పరము గ్రామనామముల నరసికొనిరి. కులగోత్రములను దెలిసికొనిరి. చదువు సంధ్యలంగూర్చి ప్రశ్నోత్తరముల జరిపిరి. అంతట పరిచయము కుదిరినది. లింగాయతస్వామి తనకడకు వచ్చిన లింగాయతులతోఁ గొందఱితో తెనుఁగునను, మఱికొందఱితో కన్నడమునను బసవమతశాస్త్రముంగూర్చి ప్రసంగించుచున్నాఁడు. అతనిస్వచ్ఛమగుభాషయు స్ఫుటమగువాక్కును వినుచు రంగరావుతోఁ గూడ ఆక్రొత్త నేస్తుఁడును గూర్చున్నాఁడు. రంగరాయఁడు స్నేహితునితో సాయంవిహారమునకు బయల్వెడలెను. వా రిరువురు చీఁకటిపడు నంతకు బసఁజేర వచ్చిరి. తన బసఁజేరఁ గొంతద వ్వేఁగిన స్నేహితుని - "భీమప్పగారూ, భోంచేసి వస్తారుకాదూ? కాశ్సేపు పిచ్చాపాటీ మాట్లాడుకుందామ్" అన్నాఁడు రంగరావు. "భోజనం లేదు ఫళారమే లేండి; ఇప్పణ్ణే వస్తాను"-అని భీమప్ప చనెను.

దివామూర్తి కనువాల్చెను. నిశాదేవత కనులువిచ్చి సింగారించుకొని కొలువుదీఱినది. భువననాట్యరంగమునందలి పూర్వాంకము ముగిసినది. నల్లతెర జాఱినది. మనుష్యుల మాటలసందడిలో మునకలు వేయుచుండిన పక్షుల కలకలారావములు పూర్తిగఁ దేలియాడెను. పతివ్రతాశీలమువలె పరమ

యోగిచిత్తమువలె ఆకాశము వినిర్మలభావముం బ్రకటించినది. పొత్తిటి బిడ్డ చూపులవలె, విశ్వతన్మయుని చిఱునగవువలె నక్షత్రమండలము నిర్వ్యాజకటాక్షములం బ్రసాదించు చున్నది. భౌతికప్రపంచము మౌనవ్రత మూనినది; ధ్యాన మవలంబించినది; యోగనిద్రాముద్రితమైనది. దృశ్య మదృశ్య మయినది. 'యద్దృశ్యమ్ తన్నశ్యమ్' అని ఉలి వాకటి యానీరవప్రకృతినుండి వినవచ్చుచున్నది.

రంగరావు ఎదుటి మండపము తిన్నెమీఁద బిఛానా పఱచుకొని కూర్చుండెను. ఎంతసేపటికి భీమప్పరాఁడు. ఒంటరి పాటు దుస్సహము. రంగరావుచూపు ఆ నీలాకాశమందలి తారకాపంక్తుల కడకుఁ బర్వెత్తెను. కాని మండపముమూల ట్రంకుపెట్టెపై నొడ్డగలబడి కన్నీరు నించుచుండిన ఆతన్నియే అచటను గాన్పించెను. తనలో దందడిగొనుచున్న భావ ములకు,- మినుకులీను నా నక్షత్రములు కొన్నియూహల నందించుచున్నవి. ఆతని హృత్ప్రవాహము పొంగి భావతరంగ మాలలతోఁ బెల్లురేఁగి నిరవధిక మగు అగాధమహార్ణవ గర్భముం జొచ్చినది. చూచుచుండఁగనే కనుల మిఱుమిట్లు గొల్పుచుండిన నక్షత్రము తూర్పునకుఁ బఱచినది. మఱి యొక్కింతసేపటికి జంటగా రెండునక్షత్రములు రాలినవి. ఈ యాకాశ మేమి! ఈచుక్క లెక్కడివి! వీనిపాటునకు హేతు వేది! ఈ యాశంకలు పొఱలినవి. తన చదివిన ఖగోళ జ్యోతి

శ్యాస్త్ర పరిచయము తనలోఁ బుట్టిన ప్రశ్నములకు గొన్నిటికి జవాబు లిచ్చినది. అంతలో నాతని మనస్సు ఆమూలఁ గన్నీరు నించుచుండిన శోకదేవత నొక్కమాఱు తొంగిచూచి వచ్చి నది. రెండవజాము చెప్పకయే పరువిడినది. రంగరాయనికి ఆవు లింతలు తఱచయ్యెను. ఱెప్పలు బరు వెక్కెను. చూపు మందగిలెను. పక్కపై వాలెను.

---

## ౪. ప్రకరణము.

మండపము వద్దకు వచ్చి, అమ్మమ్మ—

"బాబూ, రంగఁడూ, తెల్లారింది. పాతాళగంగకి స్నానా నికి వెళ్లొద్దూ? జనసమ్మర్దం అధికంగావుంది. ఈవాళ శివరా త్రిన్నమాట మరిచావు కామోసు! లే అమ్మా [1]పెందరాళే వెళితే దబ్బున వచ్చెయ్యొచ్చు. ఏటవాలుగా దిగాలిట గంగకి! ఏలా దిగుతానో ఏమిటో బాబు! అంతకూ ఆశ్రీశై లపతే వున్నాఁడు. లే! సామాను జాగ్రత్తగా చూచుకో"—

అనినది. రంగరావు తాఱుమాఱుగ లేచినాఁడు; పక్క-చుట్టుకొని బసలోనికి వెళ్లుచు—

"వెళ్ళండి నే నుంటాను"- అన్నాఁడు.

---

1. పెందలాడనే

ముసలమ్మలు మువ్వురు బయలుదేరినారు. యువతి వెంబడింపఁబోవుచు, క్రొత్తగాఁ బరిచయమైన కర్ణాలు అమ్మాయిగారి విడిదికి వెళ్ళి—

"నారాయణమ్మగారూ, స్నానానికి వస్తారా పాతాళగంగకి?"—

అని పిలిచినది. వారును సన్నాహముననే యున్నారు. అందఱొక్కచోఁ గూడి వెడలిరి. సూర్యోదయమైన కొంత సేపటికి వడివడిగ రంగరావు బసకడకు వచ్చి—

"మావాండ్లప్పుణ్ణే పోయిరి స్నానాలకు. మీవాండ్లు పోయిలేరే మండి?" అని భీమప్ప ప్రశ్నించినాఁడు.

"వెళ్ళారు మావాళ్ళు కాస్సేపైంది. మీరూ వెళుతున్నారా?"

"లేదప్ప ఎక్కడ అంటించినారు? ఈఁచల్లో ఎట్లాప్ప స్నానం చేసేది! కృష్ణకు పోవాలె— మూఁడుమైళ్ళదూరం— నాచేతల అయేల్లేదప్పా— సుడుగాడు. మంది చెప్పేకి రాదు; నే వచ్చేల్లేదని చెప్పిడిస్తి. మద్యాన్నం పాయ—స్నానం చేసి వచ్చె— అభిషేకం చేసిడిచా."—

"ఏమిటో పూర్వకాలంవాళ్లూ— వారివిశ్వాసం వారిది. వారు పుణ్యాని కంటూ వచ్చారు. మనలాంటివాళ్ళు వేడుగ్గా క్షేత్రం చూట్టానికి బయల్దేరారు. రాండి-కభుర్లన్నా చెప్పుకుందామ్. ఆఁ అన్నట్టు రాత్రి వచ్చారేకాదేఁ?"

నస్తా మనుకొంటి; మా మంటపందగ్గర అమక్కళంగా భజనచేస్తా వుండిరి. వాండ్లజతలో అక్కణ్ణె కూచో నిడిస్తి. పురందరదాసుకీర్తన్లు బలేబాగా పాణ్డారప్పా! కన్నడం—మీా కర్థమయ్యేల్లేదు లేండి. అంతా వేదాంతమే చూచుకోండి".

"అయ్యో! పిలవకపోయారటండీ నన్నూ! అయినంతవర కే అర్థమయ్యేది. సరే! రాండి"—

రంగరావు, భీమప్ప, ప్రక్కబసవారితో సామాను చూచుచుండుఁ డని చెప్పి కాలకృత్యములకై చని తొందర గనే బసచేరిరి.

పాతాళగంగనుండి తుగిడీలు తుగిడీలుగా భజనమేళాలు రా సాగినవి. ఓ! వేలకొలఁది జనము! ఆ వారి పుష్పహారములు! ఆ విభూతిరేఖలు! ఆ తాళమృదంగాది ధ్వనులు! ఆ దక్షిణాది నాగస్వరము! ఆ డోలుముక్తాయింపులు! ఆ శివనామసంకీర్త నలు! ఆ శంభోహరహర మహాదేవసంబుద్ధులు! ఆ యరమోడ్పు కనులు! ఆతాండవము! ఆభక్తితత్పరత!—కనినవానిది పుణ్యము. అందు పల్లెయనక పట్టణమనక నానామండలములవారు నానా రాష్ట్రములవారు గూడినారు. ఆ ఉత్తరహిందూస్థానమువారి ధ్యాన గానములు, ఆ బంగాలీవారి గీతములు, ఆ పండారాల 'తాయమానవర్ పాడలు,' 'తిరుకొక్కరల్ విరిత్తములు,' 'తేవా రములు,' ఆ మహారాష్ట్రుల 'దిండీ' 'సాకీ' 'జాలే' 'లావణీ'

సంకీర్తనములు, ఆ కర్ణాటకుల పురందరదాసుకీర్తనలు, ఆ యాంధ్రుల శైవకృతులు- దేవాలయాంతర్బహిః ప్రాంత మం తయు మార్మ్రోగుచున్నవి. నభోంతరాళమునం దంతటను శబ్ద బ్రహ్మ మావరించి ప్రభుత్వము చేయుచున్నది. సర్వము ప్రణ వమయము- నాదబ్రహ్మము. కులభేదములు లేవు. స్త్రీపురుష జాతి వ్యత్యయము లేదు. బాల- వృద్ధ వయస్తారతమ్యమగణన లేదు. ధనిక-దరిద్రతాపృథగ్భావముల కెడ మగపడదు. హెచ్చు-కుందులకుఁ జోటు లేదు. బ్రాహ్మణాబ్రాహ్మణ ప్రత్యేకత మటుమాయమైనది. అంటుదోషము పాటింపలేదు. అంద ఱొక్క-తల్లిపిల్లలవలె సంచరించుచున్నారు ఇది విశ్వ రూపసందర్శనముకాదా? కనులుగలవా రానందింపలేరా?— శివాభిషేకము ఆరంభమైనది.

ఆ జనసమ్మర్దమున ఆ కోలాహలమున, గర్భాలయము నందలి ఆ మంత్రపుష్పములు, ఆ మహాన్యాసములు, ఆ నమక-చమకాదిస్వనములు ఊపిరి త్రిప్పికొనలేక ఉక్కి-రిబిక్కి-రి యగుచున్నవి. ఆ శంఖారవములు, ఆ చేగంటలగణగణధ్వను లును ఎగురీది బయల్పడుచున్నవి. బ్రాహ్మణునిచేతి శంఖము బుచ్చుకొని 'ఓమ్ హరహరమహాదేవ' అని మల్లికార్జునున కభిషేకము చేయుచున్నాఁడు వైశ్యభక్తుఁడు; సహస్రఘటాభి షేకము చేయించినవా రున్నారు. సహస్రనామార్చనమొదలు లక్షపత్రిపూజవఱకుఁ జేయించినవా రున్నారు. కోటిపత్రి

పూజచేయించిన నాటుకోటసెట్టిగా రున్నారు. అర్చించిన ఆ బిల్వదళములలో, అభిషేచించిన ఆ పాతాళగంగా పావనోదకములలో లింగమూర్తి ఏదీ?— మృగ్యమయినది.

అర్చనాద్యభిషేకములు నిర్వర్తించి వచ్చినవారు పురాణములవద్ద, పుణ్యకథనముల చేరువను గూర్చున్నారు. భజనల కోలాహలము యథావిధిగ సాగుచు నేయున్నది. తాత్కాలికముగ నైన, విషయవాసనాదూరులై ఐహికస్మృతికిఁ దప్పిన వారే పెక్కు రగపడుచున్నారు. దర్శనానికి గుమ్మములో హాసీలు; అభిషేకానికి కట్నము; అర్చనకు రుసుము; హారతికి పన్ను— వసూలుచేయుచున్నారు—కంట్రాక్టరులు. సంతానార్థినియై తడిబట్టలతోఁ బ్రాణాచారపడినది కోమటి ఇల్లాలొకతె. వ్యాజ్యము తన కనుకూలమైనచో లింగమూర్తికి బంగారు తొడుగు సమర్పింతు నని మ్రొక్కుకొనుచున్నాఁడు. రెడ్డిసంపన్నుఁ డొకఁడు. ఉద్యోగము దొరికినయెడల తలవెండ్రుక లిత్తు నని దీక్షఁగొన్నాఁడు బ్రాహ్మణ బి. ఏ యొకఁడు. ఈయేడు ప్రత్తివర్తకములోఁ బదివేలు లాభము కనబడినచో గర్భాలయముముందు చలువరాతిచపటా వేయింతు నని ప్రపత్తిచేయుచున్నాఁడు లింగబలిజసెట్టి యొకఁడు. మగనికిఁ బిచ్చి కుదురునేని గండదీపము మోయుదు నని సంకల్పము చేసినది బ్రాహ్మణగృహిణి. మరలఁ దనకుఁ బెండ్లియగునేని పసుపువస్త్రాలకొంగుముళ్లతోఁ గొండెక్కుదు మని షష్ఠిపూర్తి

గడపిన సాహుకారుసెట్టి ధ్యానముచేసినాఁడు. పేకాటలో తనకు గెలుపు గలిగినచోఁ గుంభాభిషేకము చేయింతు నని ముడుపు గట్టినాఁడు జూదగాఁడు- ఇట్లు భక్తిలోఁగూడ వేర సారములు యథేష్టముగా జరుగుచున్నవి.

'శ్రీశైలమాహాత్మ్యము' పురాణముజెప్పు నడిప్రాయపు అవధానులు గొంతుక బొంగురుపోవుటచే నిరుత్సాహియై మాటిమాటికి మొగము చిట్లించుచు లేని యావేశము దెచ్చు కొని కథ నడపుచున్నాఁడు. ప్రౌఢవయఃపరిపాకమందలి దీక్షితులు కవితాధారకు నిజగాఢశారీరసంపత్తిని జోడించి 'శివరాత్రిమాహాత్మ్యముం' జదివి రాగయుక్తముగ నర్థము జెప్పుచున్నాఁడు; సత్తి కొద్దిగా అడ్డుచుండినది. కాని రక్తి కట్టించినాఁడు. ద్వాదశలింగములప్రభావము మహారాష్ట్ర పండితుఁడు సంస్కృతమున వ్యాఖ్యానము చేయుచున్నాఁడు. ప్రాకారబహిర్భాగమున 'నందనార్ చరిత్రము' హరికథ చెప్పుచున్నాఁ డొక మాలదాసరి. జంగాలు బసవకోలలను శరీరముమీఁదఁచిత్రవిచిత్రములుగ నాట్యమాడించుచున్నారు; ఖడ్గాలు జమువుచున్నారు. శివుఁడు ప్రత్యక్షము గావలయు నని నారసములతో నాలుకలనుగుచ్చుకొనుచున్నారు; నరనర మునఁ బొడుచుకొనుచున్నారు; గళమునకు గండ గత్తెఱలు వేసి కొనుచున్నారు. మెడలోని లింగమూర్తిని అఱచేత నుంచు కొని అవధాన దృష్టులతో అనిమిషత్వమునఁ జూచుచున్నారు.

ఈవిధముగ ఆరాధ్యుల తపోనియతి సాగుచున్నది. 'యాగంటి లింగ'ని ఏలలు, 'కాలజ్ఞానములోని కందార్థాలు పారవశ్యముతో బాడుచున్నది— కందిమల్లాయపల్లినుండి వచ్చిన పోతులూరు వీరబ్రహ్మమ్మతభక్తురాలు. దూదేకుల సిద్ధప్పతత్త్వాలు అరమోడ్పుకనులతో హాయిగఁ బాడుచున్నది— అల్లాడిపల్లెనుండివచ్చిన కోమటిఅవ్వ. 'శివగీత లొకరు పారాయణము చేయుచున్నారు. 'శివతత్త్వసార మొకాయన స్వారస్యముగనే చెప్పుచున్నాఁడు గాని దంతపాటనము తప్పుటచే స్ఫుటము తప్పినది. శివలీలావిలాసము విజృంభించి చదువుచున్నాఁడొకబ్రాహ్మణుఁడు. కాని అపస్వరము. శివలీలాతరంగిణి సామవేదము వల్లెవేసినట్లు చదువుచున్నాఁడింకొక ఘనాపాఠి.'పంచాక్షరీతత్త్వము' నుపన్యసించుచున్నాఁడొకపండితుఁడు. శివకవచమనుసంధించుచున్నాఁడొక త్రిదండి. గర్భాలయమున కెదుర తన్మయుఁడై తాండవించుచుఁ గరతాళములతో—

"జటాకటాహసంభ్రమ భ్రమ న్నిలిమ్పనిర్ఝరీ
విలోలవీచివల్లరీ విరాజమాన మూర్ధని
ధగద్ధగద్ధగజ్జ్వ లల్లలాటపట్టపావకే
కిశోరచంద్రశేఖరే రతి ప్రతిక్షణం మమ"—

అని శివతాండవస్తోత్ర మారంభించి శ్రావ్యముగఁ బాడుచున్నాఁడొక లింగధారిబాలుఁడు—అంధుఁడు.

"కలాభ్యామ్ చూడాలఙ్కృతశశికలాభ్యామ్ నిజతపః
ఫలాభ్యామ్ భక్తేషు ప్రకటితఫలాభ్యామ్ భవతు మే
శివాభ్యా మస్తోకత్రిభువనశివాభ్యామ్ హృదిపున
ర్భవాభ్యా మానన్దస్ఫుర దనుభవాభ్యామ్ నతి రియమ్"—

అని కాంభోజీరాగము మేళవింపఁబడిన "శివానందల హరి"లోని శ్లోకము శ్రవణపేయముగ విసరి హాయిహాయి అని పించినది. 'ఎక్కడ ఎక్కడ?' 'ఎవరు ఎవరు?' అన్నారు. భక్తులందఱు మూలమూల నున్నవారు మూఁకగట్టి పాయలు పాయలుగఁ బఱచినారు. పౌరాణికులు శ్రోత్రులు భజనమోళావాండ్రు ఎల్లరు మధువుకడకు మక్షికములువలె నిమిషమున నలుమొగములనుండి వచ్చి ఉత్తరదిక్కుననున్న మండపమును జుట్టుకొన్నారు. స్నానసంధ్యాద్యనుష్ఠానము లైనవి. లింగాభిషేకమైనది. అప్పుడే ఉపమా కాఫీ నైవేద్యము ముగించి పొడుము పట్టుకొంచి తాంబూలము తట్టివేయుచు సాక్షాత్పరమశివునివలె పద్మాసనమువేసి పాడుచున్న అయ్యరు గారు కనఁబడినారు. ఆయనశారీరసుఖము నిరుపమానమై ఆలయమునం దంతట ప్రతిధ్వనించుచున్నది. నారాయణమ్మతోఁగూడ యువతియు నక్కడకు వచ్చినది. భీమప్పతోఁగూడ రంగరా వక్కడ నున్నాఁడు. అయ్యరుగారి గానరసము శ్రోత్రలను మూర్ఛాక్రాంతులనుగఁ జేసివైచినది.

శృంగగిరిపీఠప్రతినిధులు వచ్చినారు. గోవర్ధనపీఠము పక్షమునఁ గొందఱు వచ్చినారు. శారదాపీఠశిష్యులును వచ్చినారు. జ్యోతిర్మయీపీఠధర్మాధికారి నని యౌత్తరాహుఁ డొకఁ డాగతుఁడై నాఁడు. కామకోటి విరూపాక్ష పుష్పగిరి పీఠముల తరఫున నియుక్తులుగా వచ్చినవారు నున్నారు. శ్రీ శైలస్వత్వమునకై సీమవఱకు వ్యాజ్యములాడఁ గంకణము గట్టిన పుష్పగిరిపీఠముల రెంటి పూర్వాపరవినిశ్చయ వాదములు మధ్యవర్తులు వినుచున్నారు.

మధ్యాహ్నము తిరిగినది. అభిషేకములు నిరంతరాయముగ సాగుచునేయున్నవి. భజనలు మ్రోగుచునే యున్నవి. పురాణశ్రవణమున కంతరాయము లేదు. భీమప్ప, రంగరావును తనబసకుఁ గొనిపోయి బలవంతముగా నుపాహారము బెట్టినాఁడు. నారాయణమ్మ యువతిని ఎడబాయలేదు. ఆమె, తన విడిదికిఁ దీసికొనిపోయి బ్రతిమాలి మోమోటపెట్టి ఒట్లు పెట్టి నిష్ఠురములాడి యువతికి ఉపాహారము తినఁ బెట్టినది.

సాయంకాలమైనది. చీఁకటిపడినది. అభిషేకప్రకరణ మాగలేదు. రాత్రి జాగరము. హరికథ లారంభమైనవి. జంగాలకథలు మొదలుపెట్టినారు. భాగవతాలు కట్టినారు. ఆయాయిరాష్ట్రములవారు ఒక్కొకచోఁ గోష్ఠితీరినారు. సంకీర్తనములు మెండుకొన్నవి. కోలాటాలు నెక్కొన్నవి. బాపనయ్యగార్లు కెరసనాయల్ బుడ్లదీపాల వెలుఁగున దక్షిణ

డబ్బులను లెక్కపెట్టుకొనుచున్నారు. ముత్తైదువులు మూశి వాయనాల పాళ్ళు కుదురక ఇగ్గుమొగ్గు లాడుచున్నారు. పాతాళగంగవద్ద నీటికాసుల తగాయిదాలో బూతులాడుకొని చేతులు కలుపుకొన్న పుట్టుశాస్త్రి లిద్దఱు గాయములను చూచుకొనుచున్నారు. సంధ్యావందనము రాదు సరే సరి— సంకల్ప విధానమైన ఎఱుఁగని సర్వాభట్లు పాతికరూపాయలు గడించినందునకు వింతపడుచున్నది— నీటికావళ్ళజట్టు. సంభావనల అడావుడిలో, స్నాన మాడుచుండిన సానిపడుచు మెడలోని సరిపెణ లాగి పోలీసురిమాండులో నున్న పుల్లెల కామేశంగతికి వగచుచున్నారు— ఆతని నేస్తకాండ్రు. స్వరూపప్రకటనమునకై వచ్చిన ఆశుకవులు అష్టావధానులు డబ్బాలు వాయింప దొరకపుచ్చుకున్నారు. జూదాలు రేగినవి. జాకిమణేలా పట్లాటల మొదలు ఈనాఫులవఱకు ఒకవైపు; నక్కముష్టి లొకదిక్కు; చెట్టుగుండు ఒకవైపున; వారాట లొక చెంప; చిత్తాట లొకమూల; ఎత్తుల్లొకచోట— ఈ విధముగ జువాఖోర్లు తలపడినారు. కాణీమొదలు కాసువఱకు చింతపిక్కలవలె పందెములలో పాఱవేయుచున్నారు. రూపాయల సంచులు గలగల గ్రుమ్మరించుచున్నారు. నోట్లకట్టలు విచ్చుచున్నారు. పట్టుకొని వచ్చిన సొమ్మంతయు నోడి పక్కచెవి పో గమ్ముకొని ప్రయాణము కట్టినాఁడు పడమటి సీమరెడ్డి యొకఁడు. గుడివాడతాలూకాజువ్వాఖోర్లు పైసామిగుల

కుండా ఫయిసలుచేసి అప్పటి కప్పుడు ప్రోనోట్లమీఁద అప్పు పుచ్చుకొని ఆవేశముతో ఆడుచున్నారు. పోలీసువారికి మామూళ్లు చెల్లుచున్నవి. ఆ చుట్టుపట్టుల నావరించిన బీడీ సిగరెట్లపొగకంపు, శివసాన్నిధ్యమునుండి వచ్చు సాంబ్రాణి ధూపపరిమళమును తఱిమి తఱిమి కొట్టుచున్నది.

ఆ యాత్రలో లేనివారెవరు? సమస్తప్రకృతి యచట ఆవేశించినది. పరమార్థజ్ఞానసంపన్నులతోఁ బచ్చెపుదొంగ లున్నారు. సన్న్యాసులలో సందెవేటకాండ్రున్నారు. ఉద్యోగులలో ఉడాయింపుగాండ్రున్నారు. భాగవతులలో బడాయిఖోర్లున్నారు. పండితులలోఁ పటాటోపభయంకరు లున్నారు. విరక్తులలో విలాసు లున్నారు. జువ్వాఖోర్లతో ఝూటాఖోర్లున్నారు. ధనికులతో దండుగుమారిరాము లున్నారు. సనాతనాచారులతో సంకరు లున్నారు. సోమపీథులతో సోమరిపోతు లున్నారు. సురూపులతోఁ గురూపు లున్నారు. సహజవికలాంగులతో కృత్రిమవికలాంగు లున్నారు. ఒకరుండి ఒకరు లేకుండలేదు—నోటిదూలవారు, చేతితీటవారు, కంటిగులవారు, కాలిదురదవారు, షోఖిలాలు, షోదాలు, దుర్వ్యసనగాండ్రు, దూబరదిండిగాండ్రు, సాధువులు, సంస్కర్తలు—రకరకాలు ప్రోవైనవి.

లింగోద్భవకాలమైనది. అభిషేకక్రియము ఆగినది. ఓపికగలవారు జాగరముచేయుచున్నారు. రాత్రి పంద్రెండు

గంటలు మీఱునందాఁక రంగరావుతో భీమప్ప ఈ వేడుకలు చూచుచుఁ దిరిగినాఁడు. కొండ ఈదర తిరిగినది. చలి— మంచు పడుచున్నది. రంగరాయ-భీమప్పలు తమ మండపముల వైపున కరిగిరి.

---

## ౬. ప్రకరణము.

సూర్యోదయ మయినది. శివరాత్రిహాళాహాళి ముగిసి నదిగదా యని కాఁబోలు యథాసుఖముగా బరుండియున్నాఁ డింకను రంగరావు. భీమప్ప వచ్చి-

"రంగరావుగారు, పొద్దుపొడిచింది; ఇంకా నిద్రేనే మండి?"— అన్నాఁడు. లేచి కనులు నులుముకొనుచు—

"రండి వెడదామ్"—అనుచున్నాఁడు రంగరావు.

"136 కన్స్టేబిలును, సోమప్పను పాతాళగంగకాడ కావలి వుండేదానికి అంపిస్తావా? కోనేట్లోనుంచి తీసిన పిల్ల శవాన్ని పెట్టివానితో కైలాసద్వారంకాడికి ఎత్తించకపొమ్మని అంపించు—403 శిలాక్ సాబును! పీ డేడ్రా194— సూగప్పా? రాత్రింతా కనబల్లేదేరా?— ఎక్కన్నాన్నా తాగేశి పడుకున్నాడు వాలె వుంది. చీకటితో రమ్మంటిని-చూడూ వాఁడెక్కడున్నాఁడో! ఈ రిపోర్టు మునిమడుగుపోలీసు క్యాంపు చేర్చవాలన్ శీగ్రం— తెలస్తాదా? ఆత్మకూర్ స్టేషన్లో ఇయ్యమని తలారి

సుంకణ్ణి—వాడిబీటు అక్కణ్ణే కదూ?— తఱుమ మను ఎకామెక్
—తెలస్తాదా? ఇంద—ఈ రిపోర్టు మార్కాపురంస్టేషన్ హాసా
ఫీసరుకు. వాఁ డెక్కఁడున్నాఁడు 437-సిద్దన్న? వాణ్ణి శిఖరేశ్వ
రం తోవన పొమ్మను— జమారు— తెలస్తాదా?"-

అని సబ్ ఇన్స్పెక్టరు సుందరరాజులునాయఁడు ఫరమా
యించుచున్నాఁడు. పక్కచుట్ట బసలోఁ బెట్టి భీమప్పతో
నీటిచాయ వెళ్ళుచున్న రంగరావు, కేకలు వేయుచు రబ్బరు
బొమ్మవలె నిటు నటు గంతులువేయుచున్న ఇన్స్పెక్టరును
జూచి నిలుచున్నాఁడు. ఇన్స్పెక్టరు చక్రమువలె మండ
పముల నన్నిఁటినిఁ గలయఁదిరిగినాఁడు; ఒక్కొక్కరిని, ఊరు
పేరు ఉనికి వృత్తి-అట్టు పుట్టు ఆనవాళ్ళు నరయుచుఁ బోవు
చున్నాఁడు. రంగరాయ-భీమప్పగార్లు ఈయుత్పాత మేమియా
యని ఆలోచించుచుఁ బోయి కల్యములఁ దీర్చుకొని విడిదలఁ
జేరినారు.

మీనాక్షమ్మయు పేరమ్మయు వ్యాకులపడుచున్నారు.
రంగరాయనిఅమ్మమ్మ వారిని ఓదార్చుచున్నది. రంగరావును
అమ్మమ్మ తనదగ్గఱకుఁ బిలిచి— రహస్యముగా

"అబ్బాయో, విన్నావ్!— అమ్మాయి పొద్దుట్నుంచి
అగపడ్డం లేదురా!"

"ఎక్కడికి కెడుతుందమ్మా? - ఆ కర్నూలువాళ్ళ అమ్మాయితో స్నేహంగా తిరుగుతుండేది. బహుశా అక్కడి కేమేనా వెళ్ళింది కామోసు!"

"అక్కడికీ వెళ్ళినట్టు లేదు. మీనాక్షమ్మగారు కను కొచ్చారు. వారికి తెలవ దన్నారుట!......

...ఏవిటమ్మా ఎంత చిత్రింగా నన్నావుంది!"-అన్నది అవ్వ.

రంగారావు మెల్లగా, నీ వార్త భీమప్ప చెవిని వేసినాడు. భీమప్ప ఆశ్చర్యచకితుడై—

"రాండి వాండ్లను మన మడుక్కొని వస్తాము."

ఇరువురు కర్నూలువారి బసకడకు వెళ్ళినారు. వెలుపల చెంబులు శుద్ధిచేయుచుండు నడిప్రాయపు ముత్తైదువును గాంచి—

"మీఅమ్మాయి వున్నదా లోన? మా అమ్మాయి ఇక్కడికి రాలేదూ?

అనిన రంగారావు ప్రశ్నము విని ఆయమ్మ-

"నారాయణా, వీం డ్లెవరోవచ్చినారు చూడూ."-అనినది.

నారాయణమ్మ, "ఎవరప్పా" అనుచు వెలుపలికి వచ్చినది.

"వీం డ్లమ్మాయి వచ్చిం దే మమ్మ?"- అని భీమప్ప అడిగెను.

"కృష్ణవేణమ్మనా? ఈపొద్దు వాయమను చూచేలేను- ఈడికి వచ్చేలేదుగదా? రాత్రి కొంచెంసేపు వేడుకలు చూస్తూ తిరిగినాము. ఆమెను మీామంటపంకాడ విడిచి నే వెళ్లోస్తి."

రంగరావు భీమప్పతోఁ దనవిడిదికి వెళ్లి ముసలమ్మలకు ఓర్పు చెప్పి యువతిని వెదుక వెళ్లినాఁడు. పోలీసుఇన్స్పెక్టరు చేయుచుండిన దర్యాప్తు జ్ఞప్తివచ్చినది. అది రంగరావువెతను మఱింత పెచ్చులింపఁ జేసినది. హృదయమున నావేగ మధికమగుడు బుద్ధి వికలమైనది. ఆపాదమస్తకము కంపించుచున్నది. చెమ్మట లోడుచున్నవి. ఇరువురు ఇన్స్పెక్టరుబసకు వెళ్లినారు. ఆతఁ డక్కడ లేఁడు. కైలాసశిఖరమువద్దనున్నాఁ డని జవాబు. ఆగవేగముల నట కేఁగిరి. చాలమంది గుంపులుగూడి చూచుచున్నారు. అట శిశుశవము గోనెపట్టమీాఁదఁ బడియున్నది. బాలార్కకిరణము లాశిశుకళేబరమును స్పృశించుచున్నవి. మగబిడ్డ- ఈఁగలు ముసరినవి. వాయుదేవుఁడు మెల్లగ వీచి మూాగిన ఈఁగలను జోపెను. ఆ పవనాంకురము ఆబిడ్డ వెండ్రుకల నొకమాఱు కదల్చినది. చూచుచున్నవారి కనుల నుండి దుఃఖాశ్రువు లురలెను.

"ఏపాడుముండకు చేతు లాడినా యమ్మా! ఇట్లా చంపకుంటే ఏ అడుక్కతినేవాండ్లకిచ్చున్నా సాకుకుందురు కదా!"

"లేదు- ఆ జీవికి భూమిామ్మీాద సంగటి"

"నెలలు నిండినబిడ్డే నమ్మా! నెత్తురుకందూ! ఎప్పొను పడేశినారో!"

"దేవుని తిన్నాల కొచ్చి ఈ [1]అగ మేమో చెప్పూ!"

"ఆ దేవుఁడు చంపేబుద్ధి వాండ్ల కెందుకు పుట్టించి నాఁడో! [2]కలిగ్గిరమంతా బొమ్మలాట! మాయ !"

అని పదుగురూ పదివిధాల తమ వగపును తలపోసి కొనిరి. ఇన్‌స్పెక్టరుకూడా కంటఁ దడిపెట్టుచు, శిశుశవాన్ని, పోలీసుజవాన్ను తహినాతీయిచ్చి, వెట్టివానితో పెచ్చెరువు కాంపాసుపత్రికిఁ బంపివేసినాఁడు. రంగరావు, భీమప్ప ఇన్స్పెక్టరు చెంతజేరి చెట్టుక్రింద అరుగుమీఁదఁ గూర్చుచున్నారు. ఇన్‌స్పెక్టరు తన వ్రాతముగించి తలయెత్తి చూచినాఁడు. ఈయిరువురిని మర్యాదగా వచ్చినపనినిఁగూర్చి అడిగినాడు.

"పదునేడేండ్లు దాఁటినపడుచు- పేరు కృష్ణవేణి- ఈడునకుఁ దగిన యెత్తు-అందమైనది- మంచిచాయ- తలను మిగిలిన తలకట్టు- ఈవేళ ఉదయమునుండి అగపడదు"- అని రంగ రావు ఇంగ్లీషులోఁ దెలిపినాఁడు. కంప్లైయింటు వ్రాసి ఇమ్మని ఇన్‌స్పెక్ట రడిగినాఁడు. అమ్మాయిచహారావగయరా వివరములతో వ్రాసి ఇచ్చినాఁడు రంగరావు- తత్క్షణము చర్యజరిపి పర్యవసానము దెలిపెద నని ఇన్‌స్పెక్టరు నమ్మఁ బలికినాఁడు. ఆతఁడు సహజముగా దురహంకారియైనను మనుష్యులను

---

1 అఘమునకు వికారముగాఁతప్పు, పాపము అర్థము. 2. కలియుగము...

జూచి సమయ మెఱిఁగి మాటాడు నేర్పరి. రంగారావు సెలవు పుచ్చుకొందు మని లేవఁ బోవుచుండఁగా, "అయ్యా, చూడండి- మరిచిపోతిని. కృష్ణలో- దాన్నే 'పాతాళగంగ' అంటారు లేండి- ఆడస్త్రీ పడి చచ్చిం దని తెలుస్తాది. నే నక్కడికి పోతాను- మీరు రండి సంగతి తెలుస్తాది"– అని ఇన్‌స్పెక్ట రనెను.

ఈ సంగతి తనవారికిఁ దెలుప మని భీమప్పను బంపి, రంగారావు ఇన్‌స్పెక్టరుతోఁ జనెను. ఇద్దఱు దిగువకు నడచిరి. అత్యంతము శిథిలములైన ఆ పడికట్లు దిగునపుడు లోపల రగులుచున్న వేదనతోఁగూడ రంగరాయనికి, కొండవీటి ఆదిమప్రభుఁడు ప్రోలయవేమారెడ్డి కట్టించిన సోపానము లివి యని ఐతిహాసికవృత్తము స్ఫురించినదికానోపు!—ముందు వెనుకలుచూచి తల పంకించినాఁడు. అరగంటలో గంగగట్టు చేరిరి. ఒడ్డున శవము పరుండఁబెట్టఁబడియున్నది. 136 వ నెంబరు కన్‌స్టేబిలు సోమప్ప అక్కడ కాచియున్నాఁడు. ఆ కళేబరము జూడఁగనే రంగరావునకుఁ బిడుగువడిన ట్లయ్యెను. దిగ్భ్రమ చెందినాఁడు. స్నానమునకై వచ్చిన యాత్రికులు- స్త్రీలు పురుషులు వందలతరబడి మూగినారు.

"ఇక్కడ మడుఁగు. నీటివడి తక్కువ. అందుకే పీనిగె ఇక్కణ్ణే తేలింది. లేకుంటే ఎంతదూరమో పొయ్యేండేది."

"అయ్యో! ఎవరోనే పాపం! చిన్నదే! అందమైన పిల్లేనే! ఊ దెక్కింది! చెక్కు చెదర్లేదు పెద్దమ్మా! నిద్ర పోతూన్నట్టుంది! ఏమోపాపం స్నానికేవచ్చి కాల్జారిపడిందో! ఏం కష్టం తోచిందో!"

"పున్యాత్తురాలే తీవో— శివరాత్రిపూటా — శ్రీశైలానికి వచ్చి ఈ గంగలో ఆత్మారాముణ్ణి వదిలింది. అందరికీ కోరుకున్నా వస్తుందీ ఇట్టాంటిచావు! పోయినవా రందరూ పున్యాత్తులే ఈ పాపపులోకంలో ఇంకాబతికి ఎవర్నుద్ధరించాల?"

"ముత్తైదపిల్లేనే! ముక్కుగొట్ట ముంది— చేతుల బంగారుకడా లుండాయి. ఆమెంటికెలు చూడే! నిలువునా వున్నాయి. ఆమెకేం సార్గవత్తైంది."

"ఏం కులమో! నా అనేవాం ళ్లెవ్వరు రారే! వాం ళ్లెక్కడ వెతకుతా ఎదగొదలు పడతా ఏడుస్తావున్నారో!

"ఎక్కడపుట్టిందో ఎక్కడపోయిందో చూడు! కళ్లున్నకాడికే కంటి——"

చూచినవా రందఱు తలకొకమాటతో ఖేదపడుచున్నారు. రంగరావు నిర్విణ్ణుఁడై కూర్చున్నాఁడు. ఇన్స్పెక్టరు మొగమునఁగూడ వెత కనఁబడినది.

"ఏరా నేఁడు [1]కండ్రావికండ్రావిగా ఉండాది. ఎక్కడ్రా పడివుండింది శవమ్?" అని యడిగినాఁడు ఇన్స్పెక్టరు. తేలిన

1. కంౘ్రావి=ఘోరము (అశివము).

చోటు చూపి,ఆ చోటునుండి [1]అరిగోలులోవేసి గట్టునఁ జేర్చి,నా మని చెప్పినాఁడు సోమప్ప. ఇన్స్పెక్టరు రంగరావునుగాంచి

"ఏమండీ మీ అమ్మాయేనా?" అని ప్రశ్నించినాఁడు.

తల అడ్డముగా నాడించుచుఁ గా దని రంగరావు తెలిపినాఁడు.

లేచినాఁడు ఇన్స్పెక్టరు. రంగారావుకూడ వెన్నంటినాఁడు. అపరాహ్ణమైనది. దేవాలయము చేరినారు. అప్పుడే పెక్కురు యాత్రికులు గృహోన్ముఖులైనారు. ముసలమ్మలు ముప్పురుఆవేదనపడుచురంగరావురాకకెదురుచూచుచున్నారు. రంగరావును చూడఁగనే అందఱు బావురు మన్నారు. జరిగిన వృత్తాంతము ఆతఁడు ముసలమ్మల కెఱిఁగించినాఁడు. పేరమ్మగారు అమ్మన్నను స్మరించుచు పరున్నపక్క పొర్లలేదు. మీనాక్షమ్మ ముక్కుచు మూల్గుచు లేచి దూరముగా నున్న దొరువులో స్నానముచేసి నీళ్ళు తెచ్చినది. ప్రొద్దు వాటవాలునప్పటికి పచ్చడీ మెతుకులు వేసినది ఆమె ధర్మమా అని. నిన్న కటికోపవాసము. నేఁ డస్తమయపర్యంతము గంగాపాశన లేదు. పైగా అలజడి- ఆరెండుమెతుకులు పడినవి. గతరాత్రి జాగరము. అమ్మన్నను తలఁచుకొనుచుఁ బరున్నారు ముప్పురమ్మగార్లు.

---

1. అరిగోలు=వెదురుబద్దలతో నల్లి తోలుకట్టినబుట్ట—పడవవలె ఏరు దాఁటు సాధనము.

రంగరావునకు నిదుర యెక్కడిది? ఆతని మనస్సు కృష్ణవేణి యంతర్ధానమునకై పొగులుచున్నది. ఆమె నన్వే షించుటకై రెక్కలుగట్టుకొని పఱచినది. బ్రహ్మలోక పర్యం తము ప్రయాణము చేసినది. నడుమ నడుమ నొకొక్క మాఱు కోనేటిగట్టునకుఁబోయి ఆశిశుశవముం దర్శించు చున్నది; ఖేదమొందుచున్నది. అంతలో కృష్ణయొడ్డున కెగిరి పోయి ఆ స్త్రీకళేబరమును దరియుచున్నది; ఉమ్మలించు చున్నది. మరల నెటకో పరువెత్తి పోవుచు - ఆ తెల్లచీరతో ఆ కుచ్చులజాకెట్టుతో ఆ జాఱుజడతో చిఱుచెమ్మట నానిన ఆ నుదుటి తిలకముతో అవనతముఖియై వచ్చుచుఁ, దటాలున స్టేషనువైపునకుఁ దిరిగిచూచుచున్న కృష్ణవేణి ముఖవిలాసము దర్శింప దుమికినది; ముచ్చటలాడ నువ్విళులూరినది. యువ కునిఁగాంచి కన్నీరునించినకృష్ణవేణికడ నొక్కింత నిలిచినది. ఇట్లు వివిధగతుల పడుగుపేకలుగఁ బరిభ్రమించు చున్నది. నిలుకడలేదు. సర్వము శోకమయమైనది. ఇఁక నిద్ర యెక్కడిది?

భాగ్యవశమున రంగరాయనికి భీమప్పసాహచర్య మబ్బినది- అంతలో అతఁడును డాసినాఁడు—

"ఏమండి రంగరావుగారూ, పండుకొన్నారా?"

"భీమప్పగారా, రాండి. నిద్రాలేదు భద్రాలేదు; ఈ వేళ ఈ హంగామాలో నిద్రకూడానా?"

"సత్తెమైనమాట- ఈ పొద్దు ప్రాణ మంతా ఎక్కడెక్కణ్ణో అయింది- నాకూ నిద్దర రాకనే ఏదో మాట్లాడుకుందా మని వచ్చిడిస్తి. చెప్పేకి మరిచిపోతి. మధ్యాన్నం ఎక్కడా సాహిత్యం దొరకలే దని ఒక బ్రామ్మడు వచ్చె. భోంచేయ నీకి రమ్మంటే రాడు- భలే పీకులాట అయింది వాయన్తో. ఆఖరీకి ఖట్లామీంద భోంచేసినాం డని పెట్టుకోండి"

"సాహిత్య మేమి టండీ?"

"మీా కర్థమై లేదా? సదావృత్తికి - వంటచేసుకోనీకి బియ్యం బాళ్ళు యిచ్చేదానికి సాహిత్య మంటూరు ఈ తట్టు వాండ్లు.

"సాహిత్య మంటే ఇదా?"

"ఇంగే మను కొంటిరి?"

"ఏదో భాషావిషయ మనుకొన్నాను సుమండీ!"

"దేశాని కొక తీరుమాటలు."

"మీా ప్రయాణ మెప్పుడు?"

"రేపుమధ్యాన్నం భోజనా లయినాంక పోతామన్ని; మూవాండ్లు. మీారో?"

"మేమూను. ఇహ నేం పనుం దిక్కడ? వచ్చినందుకు వేడుగ్గా కాలక్షేపం చేయటానికే లేకపోయింది గదా!"

1. బేడలు=పప్పు.

చాల ప్రొద్దుపోవు వఱకు ఇరువురు నేదో లోకాభి రామాయణంతోఁ గడపినారు.

భీమప్ప పరుండి—

"పగలు ఎండ చంపేస్తుంది. మళ్ళీ ఇదివఱకునుంచీ చలి దంచేస్తుంది."—అనెను.

"ఋతుధర్మమ్..........."

ఇంకను రంగరావు ఏదియో చెప్పుచుండఁగనే భీమప్ప సుషుప్తిలోఁ బ్రవేశించినాఁడు.

---

## ౭. ప్రకరణము.

సాయంకాలము మూఁడున్నర గంట బండిలో మార్కా-పురమురోడ్డుస్టేషనులో సూర్యనారాయణ దిగినాఁడు. శ్రీశైలమునకు బండ్లెక్కడ దొరకు నని స్టేషనుమాస్టరు నడినాఁడు. ఊరిలోనికి వెళ్లి విచారింప మని ఆయన హితవొసంగినాఁడు. పరిచితు లెవ్వరును లేరు- క్రొత్త- తిన్నఁగా జట్కాలో మార్కాపురమునకు వెళ్లినాఁడు. పూటకూటియింట విడిసినాఁడు. శ్రీశైలానికి వెళ్లుటకు బండ్లు దొరకునా యని కనఁబడినవాని నెల్ల నడిగినాఁడు. ఊరిలోని బాడుగబండ్లన్నియు వెళ్లినవి. ఇఁక దొరక వని కొంద అన్నారు. తెల్లవాఱఁగా శివరాత్రి

కదా ఇప్పుడు పోయినఁ జేరున దెప్పుడు? ఉత్సవ మంత అయి నపిమ్మట వెళ్లియుఁ బ్రయోజన మేమి?- అని కొందఱు నవ్వుకున్నారు. ఇఁక గత్యంతరమేది? నడచియైన వెళ్లవలయు నని నిశ్చయించుకొన్నాఁడు. ఒంటరిగ వెళ్లు టెట్లు? సాహసించి వెళ్లినను త్రోవ డొంక తెలియదు. దారిలోని గ్రామాదులలో నడిగి తెలిసికొనరాదా అని తెగువచేసినాఁడు. అంతలో నిరు త్సాహ మావరించినది. రేపు శివరాత్రి. శ్రీశైలముచేరుటకు కనీసము రెండుదినము లైనఁ బట్టును. తనవారు దారిలోనే ఎదురుపడుదు రేమో! కాదా- వారు ఆత్మకూరుమార్గమున మహానందిక్షేత్రమునకు వత్తురేమో! అట్టిచో నెవరి దారి వారి వారిదగును కాదా? ఇంతశ్రమపడి వెళ్లినను వ్యర్థమగునేమో!

ఈ విధ మగు సందేహములు సూర్యనారాయణను సుడితిప్పినవి. తెల్లవాఱినది. శివరాత్రి మార్కాపురముననే కడచినది. మూఁడవనాఁటిమునుమాపునుండి శ్రీశైలమునుండి వచ్చు తిరుగుబండ్ల నెదురుచూచు చున్నాఁడు. నాలవదినము సాయంకాలము నాలుగు గంటలకు బజారులో నుండఁగా రెండెడ్ల బండ్లు కనుపించినవి. అవి శ్రీశైలమునుండి తిరిగివచ్చిన వని యెఱిఁగినాడు. ఇంకను వెనుక బండ్లు వచ్చుచున్న వనియు విన్నాడు. సాధారణముగా బయటి ఊళ్ళ వాండ్రు స్టేషన్ వద్ది సత్రముననే బసచేయుదు రని తెలిసినది. వెంటనే తన పక్కచుట్టతో జట్కాలో స్టేషన్ సత్రము చేరి

నాఁడు. అచట బండ్లు బడకలేవి లేవు. ప్రొద్దు కొండలోఁ బడినది. బయటి వసారాలో స్తంభాని కానుకొని కూర్చు న్నాఁడు. ఉబుసుపోకకు సిగరెట్టంటించినాఁడు.

లోపలిగదిలోనుండి:—

"ఇంగ చాల్లేబ్బ-ఏడ్శినావ్, ఏడిస్తేవస్తుందా? దాని చా వబద్దం మనచాపు నిబద్ది అయింది. కొంప చేరేదాకా రొవంత బిగపట్టకో."

"ఒక్కగాని ఒక్కపిల్ల - మరిచినామరుపు రానిబిడ్డ. గుక్కలో ఇన్నినీళ్ళు పోసి ఈఘటాన్ని కడతేరుస్తుందని పుట్టె డాశతో వున్నాను-నా పుట్టెడాశానట్టేటిపాలైంది. ఆదేవుఁడు చూళ్ళాక కండ్లల్లో నిప్పులు పోసుకున్నాఁడు........."

"నీ యేడుపు చాలించవుగదా? ఏందమ్మా చెప్పితే వినవూ! అన్న వస్తే అరస్తాడుచూడు."

ఈ మాటలు సూర్యనారాయణ విన్నాఁడని ఎవ రనఁగలరు? ఆతని చిత్తము పరాయత్తమైనది. అంతయు అయో మయము. ఆఁడువారు-తోడులేదు. అడవులలోఁ బ్రయాణము. వన్యమృగములు సంచరించుచోట్లు- దోపిళ్ళు కూడ జరుగు చుండును సని వదంతులు. ఏమిఇబ్బందుల పాలగుదురో! వత్తునని నమ్మఁబలికి పోఁ జాలమికై వగపు. ఇట్టి చింతలవంతలలోఁ బొరలుచుండిన ఆతనికి ఒరులమాటలు వినఁబడునా? వినఁ

బడినను బోధపడునా ? ఒరులు కనఁబడుదురా ? కనఁబడినను గుర్తింపఁబడుదురా ?

బ్రాహ్మణుఁడొకఁడు ఉన్నతమైనవాఁడు మోటుదేఱిన మనిసి బయటినుండి బిరబిర సావడిలోనికేఁగెను; ఆ మనుష్యులు మాటలాడుచుండిన గదిలోఁ బ్రవేశించెను. ఆఱడుగులఎత్తు- ఎత్తునకుఁ దగిన ఒత్తుగలిగి, పదునాఱుమూర పదియవ నెంబరు మాలనూలుకోక మూలచెఱఁగులుదోపి గట్టి, ఎడమకొప్పు, మూడు సవాసేర్ల ముంజేతి వెండికడియాలు, ముక్కు-పోగు, చిలుకలకమ్మలు ధరించి పడమటిసీమ పంటకాపుసాని నమూనా యగు సత్రపుదాసి సుంకమ్మ దబదబ సత్రములోనికిఁబోయి సావడింటిలోని దీపపుబ్రమిద తీయుచు—

" ఎవ రాపండుకోనుండేది ? దీపారాజన చేసేయాల పండుకోనుండావు ! లేలే ! " అని యదలించెను. పరుండియుండిన సన్న్యాసి యొకఁడు లేచి వసారాలోనికి వచ్చుచు, "దారి నడిచిందాన ఆయాసమైంది. ఇప్పు డిప్పుడే వచ్చి పండుకొంటిని "— అన్నాఁడు. సూర్యనారాయణ ఆతనినిఁ జూచినాఁడు. ఆ ముండితశిరస్సు, ఆకాషాయాంబరములు, ఆ కాశీలోటా, ఆయసిమిసంచి—చూచి సాధువుగా భావించినాడు. దబ్బపండువంటి ఆ తనూచ్ఛాయ, ఆ వయః పరిపాకము, కనులలోని ఆప్రజ్ఞ, వేషమునందలి ఆ నిరాడంబరత, మాటయం

దలి నెమ్మది, ఆ వర్చస్సు సూర్యనారాయణ దృష్టిని పూర్తిగ నాకర్షించినవి.

"దయచేయండి సాధుజీ! ఈలా అరుగుమీఁదికి"— అన్నాఁడు సూర్యనారాయణ.

"అట్లాగే బాబా"—అని సాధుజీ వెళ్ళి కూర్చున్నాఁడు. చమురులోఁ దడిపినవత్తులు రెండువేసి సావడిలోను వసారాలోను దిపాలువెలిఁగించితి ననిపించుకొని వాలాయము తీర్చుకొనినది సుంకమ్మ. లోపల నున్నవారిని పరఖాయించినది.

"సత్రాని కొచ్చే సచ్చినోళ్లొక్కరైనా ఒక్క [1]బొట్టన్నా చేతపెట్టేపాపాన పోరుగదా !— ఈళ్ళనోళ్ళల్లో మన్ను బొయ్య- ఎట్టిచాకిరీ చేపించుకుంటారు. చెప్పకుండా వుడాయిస్తారు. పోనీ [2]రుడపాతకమోళ్ళు..." అని యేదేదియో గొణగుకొనుచు సత్రముమునుకు తిరిగినది. ఇక్కడ వసారానిలో దీపము కొండెక్కినది. మఱొక్క నిమిషమునకు సావడిలోని సందె లక్ష్మియు స్థూలరూపమును చాలించినది. ఇంక ఆ బేచి రాకుకొంపలో నునికియెట్లు ? గదిలోని వారేదో సన్న దీపమువెలిఁగించుకున్నారు. క్రమముగా సందెచీకటి వ్యాపించుచున్నది. ఎక్కడనో ఎడ్లమెడ గంటలు మ్రోగుచున్నట్లు భ్రమించుచు మాటిమాటికి సూర్యనారాయణ ఆలకించు

1. కాణి. 2. ఋణపాతకపువారలు.

చున్నాఁడు; అంతలోఁ 'గా'దని భ్రాంతిఁ దొలఁగుచున్నాడు. అంత సూర్యనారాయణకును సాధుజీకిని ఇట్లు ప్రసంగము సాగెను :—

" తమ దేదేశంసాధూగారు ? "

" అన్ని దేశాలు మనవే. ఏదేశ మని చెప్ప మన్నారు. విశ్వమే మనది."

" ఆఁహాఁ- అదికాదు- తమ రేదేశంనుంచి దయచేస్తూ న్నారని అడిగాను. తప్పైతే క్షమించండి."

" తప్పేమున్నది లెండి. తప్పులూ ఒప్పులూ మనం కల్పించుకొన్నవే- అంతా ఒప్పే; తప్పనేదే లేదు. మీకు తప్పైనది నాకు ఒప్పు- నాకు తప్పయినది మీకు ఒప్పు- ఇందులో తప్పొప్పుల తగాదా తీర్చేవా రెవరు బాబా ? ఏ మంటారు ? ప్రస్తుతం బెంగాల్నుంచి రాక. తర్లుపాడులో భిక్షచేసుకొని రావడమైంది. "

" అందుకనే అలసిన ట్టగపడుతున్నారు. "

" ఉపాధికేలేండి ఈబాధ లన్నీ. దీ న్నాశ్రయించు కొని వుండేటంతవఱకూ మనస్సుకూ బాధలు తప్పవు. మన స్సూ శరీరమూ ఆధారాధేయములు. అదే అన్యోన్యాశ్రయ ణము- ప్రాణవాయువులు సంచారం చేస్తూవుండేదాఁకా నే మనోవ్యాపారం. అది జరుగుతూవున్నంతవఱకే భౌతికశరీరానికి

సుఖ-దుఃఖాలు- ప్రకృతికి వికృతి స్వభావం. ఆ వికృతిని దాఁటితే అంతా ఆనందమే. సరే- దీనికేంలేండి! తవ్వేకొద్దీ లోతు- అంతా వుంతా ?"

"చిన్నవయస్సులోనే ఇంత విరక్తి కలిగిందే మీకు! పూర్వజన్మపుణ్యమ్ !"

"బాబా, కోపంరాదుగదా ఒక్కమాట ఆలకించండి. లోకానికి ఆలోచన తక్కువ- అనుకరణ మెక్కువ- ఎక్కువేమి తక్కువేమి ? ఉండే దంతా అనుకరణమే. రక్తి విరక్తి పరస్పరం కల్పితాలు- రక్తి వికారమే విరక్తి. విరక్తి ఆభాస చెందితే రక్తి ఔతుంది. ' ఏకోరసః కరుణయేవ నిమిత్తభేదాద్భిన్నః పృథక్పృథ గివాశ్రయతే వివర్తాన్' అన్నాఁడు భవభూతి. కాఁబట్టి అసలు రక్తే ప్రధానవస్తువు. దాని అభావాన్నే విరక్తి అనుకుంటూవున్నామ్. ఒకదానియందు విరక్తి కలిగిందంటే ఏమన్నమాట?- మఱొకదానిమీఁద రక్తి కలిగిందన్నమాట- ఏమంటారు ? రక్తే స్వతస్సిద్ధమైంది. విరక్తి తెచ్చుకున్నది. ఇఁక ' పూర్వజన్మపుణ్య ' మన్నారుగదా ? పూర్వజన్మ మనేది అనుషంగికంగా వచ్చిన మామూలుమాటేకాని సిద్ధాంతంకాదు- ఏమంటారు ? అది సిద్ధాంతమే అయితే ఇన్ని మతభేదాలకు కారణ ముండగూడదు- ఏమంటారు ? ఏందో లెండి ! ఈ వెఱ్ఱివేదాంతానికేమి? "

సాధూజీహేతువాదమునకును సందర్భశుద్ధికిని సూర్య నారాయణ తనలోఁ దాను మెచ్చుకున్నాఁడు. తనకుఁగల సందేహములు తీర్చుకొనఁ దలచినాఁడు. వారిద్దఱకు మరల నిట్లు సంభాషణము జరిగెను :

"సాధూజీ, తా మే పీఠానికి చెందినవారో ?"

సాధు చిఱునవ్వున- బాబా, మన వాదం మీకు విపరీతంగా తోస్తుంది. పోనీ ఏదో అడిగినారు. కాలక్షేపంకూడ అవసర మైంది. అన్నిపీఠాలూ ఆశ్రియించడమయింది. అన్ని మతాలు పెద్దలవల్ల వినడమూ అయింది. ఆత్మకు హితమైం దొక్కటీ కనపడలేదు. 'సతాంహి సందేహపదేషు వస్తుషు ప్రమాణ మతఃకరణ ప్రవృత్తయః' అన్న కాళిదాసు వాక్యం సమస్త మతముల సారం అంటే- సర్వమునకూ అతఃకరణమే ప్రమా ణమ్ బుద్ధిమంతులకు."

"అలాఁయితే మన ఇష్ట మొచ్చింది చేయ మొచ్చున్న మాట."

"ఆహా - ఇష్టము వచ్చింది చేయడమూ, కష్టంగా తోచింది మానివేయడమూ."

"ఇష్టమైతే తప్పుకార్యాలు చేయవచ్చా?"

"మళ్ళీ మొదటికి వచ్చినారు. అది తప్పో ఒప్పో ఎవరు నిర్ణయిస్తారు?ఏకార్యానికి తలపెడితే గుండెదడ కలుగుతుందో దాన్ని త ప్పనిన్నీ ఏకార్యానికి పూనుకుంటే గుండె ఉత్సా

హాన్ని పురికొల్పుతుందో దాన్ని ఒ ప్పునిన్నీ గ్రిహి స్తే సరి-అదే అన్ని మతముల నిగ్గున్ను." తన చేసిన పని ఒకరికి చెప్పడానికి జడిస్తే ఆపనితప్పు. చేసిందాన్ని చెప్పగలిగితే ఒప్పు. తప్పొప్పులకు తేడా ఇంతె చూడండి. దీన్ని నిర్ణయించి హెచ్చరిస్తూ వుంటుంది అంతఃకరణమ్ - ఏమంటారు? ఇంత దూర మెందుకూ: 'మనయేవ మనుష్యాణామ్ కారణమ్ బంధమోక్షయోః' అన్నారు. బంధానికిన్నీ మోక్షానికిన్నీ మనస్సే కారణ మన్నా రు. అంతే: అంతఃకరణమే నన్న మాట—ఏమంటారు?

అనిన సాధూజీసమాధానమునకు సూర్యనారాయణ అంగీకారసూచకముగా నిలువున తల ఆడించుచు, జేబులో నుండి నిప్పుపెట్టెతీసి పుల్ల వెలిగించి చేతి గడియారము చూచుకొని—

"అబ్బా ! ఎనిమి దైం దంటోయ్... ఇంక ఈ పూట ఉపవాసమే లెండి."

"ట్రియినుకు పోవలసివుంటే టయిం అయింది."

ట్రియినికి కాదండి. మావాళ్ళు శ్రీశైలం వెళ్ళారు. వెంట మగా ళ్ళెవరూ లేరు. నేను వెళ్ళవలసింది. వస్తా నని నమ్మించి వాళ్ళని పంపాను. నాకు వెళ్ళటం పడ్డదికాదు. ఈ వచ్చే తిరుగుబళ్ళల్లో మావా ళ్ళొస్తా రేమో నని కాచు కూర్చున్నాను."

"అయితే సరే. అంతా దైవాధీన మని నిర్విచారంగా వుండడమే జన్మానికి పరాకష్ట. అయినదానికి చింతించీ లాభం లేదు. కాబోయ్యే దాన్ని గూర్చి అలజడి పడ నవసరమూ లేదు. అది పామరత్వ మనిపించు కుంటుంది- ఏ మంటారు? కాలాతీతులపాట మన కెటుక లేదు. ఇక మనబోటి కాల బద్ధులను కాలమే నడిపిస్తుంది-ఏమంటారు?"

"చిత్తం. అంతేనండి చివరముక్క. నాకేమైనా మత సమ్బంధమైన పుస్తకాలు చెబుతారా ?- చదువాలె నుంది. వివేకానందస్వామి బోధనలు కొన్ని చదివాను. రామతీర్థ గ్రంథం గూడా ఒకటి చదివినట్లు జ్ఞాపకం కాని తమ వంటి తెలిసినవారి సేవ కొన్నాళ్ళు చేస్తేనే కాని అవి బోధపడవు."

"బాబా, కోపగించకండి-మనవిచేస్తాను. కళ్ళుమూసు కొని చూడడానికీ, చెవులు మూసుకొని వినడానికీ యత్నిస్తూ వుంటుంది లోకం - ఇది స్వభావమే అనండి. తన రొండిలో వున్న వస్తువును మరిచి నిన్నూ నిన్నూ అడిగితే ఎవ రేమి చెబుతారు ? మతం మతం అని అర్థంలేని వెఱ్ఱిలో పడు తుంటారు. వేదాంతవిచార మంటూ డబాయిస్తూ వుంటారు. తన్నుమరచి జగత్తునంతా మరమ్మతు చేతా మనేదాన్ని మత మంటున్నారు. తన చూడని— చూడ లేని— దాన్ని గురించి పారిభాషికశబ్దాడంబరంతో ప్రసంగించే దాన్ని వేదాంత మనుకుంటున్నారు. ఇదంతా మోస మంటే

నమ్మండి. అంటే పెద్దలు చెప్పిన మార్గాలను ఆక్షేపిస్తూవున్నా ననుకోకండి. వారు సవ్యంగానే బోధించినారు. నిన్ను నీవు తెలుసు కోమన్నారు. ధర్మం చేయమన్నారు. 'తనయందు నిఖిలభూతము లందు నేకభంగి సమహితత్వమ్మున జరుగు వాడు.—' ఇందులో త న్నెఱుగడ మున్నది. ధర్మము చేయడ మున్నది. ఇంతకంటే మతమూ ఇంతకంటే వేదాంతమూ మ త్తే ముంది?- ఏ మంటారు?"

సూర్యనారాయణ మరల అగ్గిపుల్ల వెలుగున చేగడియారము చూచుకొని సిగరె ట్టంటించినాడు.

"బాబా, టయిమ్ ఎన్నౌతోంది?"

"తొమ్మిది కావస్తుంది." మీ రెందాక?"

"ప్రస్తుతం గుంతకల్లు; అక్కణ్ణుంచి కాల మెక్కడికీడిస్తే అక్కడికి.

"మీరు వెళ్ళేబండి రాత్రి రెండుగంటలకు వస్తుం దనుకుంటాను."

"ఆఁ—"

అని, సాధూజీ గోడవైపున సంచిని తలగడగా నుంచుకొని పరున్నాడు. ఎడ్లమెడగంటల చప్పుడు వినఁ బడినది. క్రమముగా ఆ చప్పుడు దగ్గఱ దగ్గఱకు రాఁ దొడఁగినది. సూర్యనారాయణ అరుగు దిగి, కొన్ని యడుగులు ముందునకు నడచి ధ్వనివచ్చు దిక్కు ముఖమై నిలిచినాఁడు. చిమ్మ

చీఁకటి- బండ్లవాండ్రి అదలింపులు విసఁ బడుచున్నవి. ఇంకెం తదూరమున వచ్చుచున్నవో రా నిమ్మని మరల తిన్నెమీఁద తన స్తంభాన్ని కానుకొని కూర్చుండుచు—

"ధ్వని వినఁబడుతుందికాని, బండ్లు కనఁబడవు- ఎంత దూరాన వున్నవో! అందులో కన్ను పొడుచుకున్నా కనపడని అంధకారమూ...సాధూజీ పరున్నారా?"

"బాబా, కళేబరం పడింది. కన్ను మూఁతలేదు. మీ రన్నమాటలు వినఁబడుతున్నవి. ధ్వని వినఁబడు తున్నదికాని బండ్లు కనఁబడ వన్నారు. ఎంత అర్థ ముంది బాబా!"

"ఏమిటండీ? సెల వియ్యండి."

'వింటారా?- నాద బిందుకళలే సృష్టి పరిణామానికి మూలస్థానాలు. నాదంలోనుంచే బిందువు. బిందువులోనుంచే కళ- అంటే అవ్యక్తంలోనుంచే ఈ సృష్టంతా వ్యక్తమైంది. ఆ చీఁకటి వదిత్తేకాని ఆ తత్త్వం కనఁబడదు. ఈ చీఁకటి తొలిఁగితేకాని ఈ ప్రకృతి వస్తువు లగపడవు- ఏమంటారు? ఏదో పిచ్చిమాటలు."

"అబ్బో! పిచ్చిమాడలే! పిచ్చిని వదల గొట్టే మాటలు."

బండ్లచప్పుడు మఱింత దాపున వినవచ్చెను. సూర్య నారాయణ చప్పున వెళ్లి పూర్వస్థానమునలిచినాడు. కొన్ని

నిమిషములకు బండ్లవరుస సమీపించినది. అందుఁ గొన్ని రెయిలుగేటు దాటఁ బోయెను. మూఁడుబండ్లు మాత్రము సత్రము వద్దికి వచ్చి యాగెను. యువకుఁ డొకఁ డొకబండి నుండి దిగి,—

"దిగండమ్మా ఇదేసత్రం. జాగర్తగా దిగండి."-అనెను.

"తాళవమ్మా నన్నుదిగనీ-మాయగోల- నే దిగి నిన్ను దించుతాను''-అని పూర్వసువాసిని యొకతె దిగి, తలమీఁది ముసుగు సవరించుకొని కొసచెంగు బిగించి రొండిలో దోపు కొనుచు-

"ఇహ దిగు"-- అన్నది.

ముసలమ్మ లిద్దఱు దిగినారు.

"బాబూ, మంచితీర్థపునుయ్యి దాపే కాదూ?" అన్న దొక ముసలమ్మ.

"దా పేమిటే!-కాస్తదూరమే వెళ్ళాలి." అన్నది."- మఱొక ముసలమ్మ.

"ఉండండి వెడదాం సామాను దింపించి కొవ్వొత్తి దీపం వెలిఁగిస్తాను. చీకటిగుయ్యారం!" అనుచు నాయువకుఁడు సామాను అరుగుమీఁద సరిదించి క్రొవ్వొత్తిదీపము వెలిఁ-గించినాఁడు. తనవారే యగుదురా అని సంశయమునఁ జూచుచు నిలుచున్నాఁడు సూర్యనారాయణ. కంఠధ్వని తమ

వారిదిగనే యున్నది. కృష్ణవేణి కనఁబడదు. ఈయువకుఁ డెవఁడు?-అని ఆలోచనలోనికి దిగినాఁడు. "అప్పుడే బయల్దేరావటమ్మా? స్నానమేమిటి ఈయద్ధరాత్రిళ్లో మాయగోల. ఒళ్ళు తిప్పుతూవుం దనవ్వూ? నీ విక్కడే ఆగు. నీళ్ళుపట్టుకొస్తాను-మంత్రస్తానం చేతూగాని." అన్నది మఱొకమ్మ-సూర్యనారాయణ వెంటనే ముందునకు వచ్చి—

"మీానత్తయ్యేనా ?

"ఎవరువారూ?"- ముందునకు వాలి చూచినది.

"నేను కాదుటమ్మా సూర్యనారాయణ్ణి?"

"ఓరి నువ్వటోయ్! బాగా చేశావుబాబు!"

"సూరాయ్, అమన్నను అప్పగిం చొచ్చామ్ మల్లికార్జునుడికి"—అనిగొల్లున పేరమ్మ ఏడ్చినది.

సూర్యనారాయణ దిగ్భ్రాంతుఁడైనాఁడు. ఎక్కడికి వెళ్ళినట్లని తహతహపడినాఁడు. "ఆనక మాట్లాడుకుందామ్ లెండి" అని రంగరావు సముదాయించినాఁడు. కాని సూర్యనారాయణకు ఆవేగ మాఁగలేదు. పేరమ్మగారు తప్ప కడమ వారందఱు నూతికి వెళ్ళినారు. వెంట గంగరావు దీపముఁ గొని చనినాఁడు. ఒంటరిపాటున సూర్యనారాయణ పేరమ్మగారిని క్రుచ్చిక్రుచ్చి అడిగినాఁడు-జరిగినవృత్తాంతముఆమె చెప్పినది."

"నే ననుకున్నంతే ఐంది. ఆవేళ బెజవాడలో కన్నీళ్ళెట్టుకున్నది. ఇ దేమిటో అపశకున మనుకున్నాను. నేను

మీతో వెళ్ళవద్దనేచెప్పాను- విన్నదికాదు. శ్రీశైలం చూడా లని ఉవ్విళ్లూరింది. మీ రక్కడ ఏమి చిలిపిపని తల పెట్టారో జడిసి పోయుంటుంది. ఆవెంద్రుక లుంటే పుట్టి ముంచుకపోయిందా?"

"మే మే మన్నాంరా? ఆలావుంటే చూచినవా రేమంటారు? నలుగురు బంధూల్లో అపఖ్యాతికాదూ? వచ్చింది.— ఆలాంటియోగం దానికి పట్టింది. ఇప్పు డనుకుంటే లాభ మేమిటి? ఎక్కడికెళ్ళిందో!"

"అదే నాకూ పాలుపోవటంలేదు. వట్టిపిరికిది. గండా గొండితనమూ తెలియదు." అనియాలోచన నభినయించి— "బహుశా విశాఖపట్నం వెళ్ళి ఉంటుం దనుకుంటాను; తప్పదు- అక్కడికే వెళ్ళిఉంటుంది."

"విశాఖపట్నం ఎందు కనివెడుతుంది?— ఎవ రున్నారని అక్కడ?"

"రంగనాయకమ్మ ఉండలే దటమ్మా?"

"ఆఁ-రంగనాయకమ్మా? ఎవరూ?"

"ఆఁ-నాన్నగారు అనకాపల్లెలో ప్లీడరీచేస్తున్న రోజుల్లో మనమేడ కెదురుగా డాబాయింట్లో తహసీల్దారు భీమశంకరంగా రనేవా రుండలా?-జ్ఞాపకాని కొచ్చిందా?"

"ఆఁ..."-కొంచెమాలోచించి - "రాధమ్మగారి భర్త గారు కాదూ? ఆ వారందరూ ఎంతమంచివాళ్ళూ. అరమరికలు లేకుండా మనలో కలిసి పోయ్యేవారు."

"ఆఁ...ఇప్పటికి తెలిసిందీ?"

"ఆఁ...అల్లాయితే ముమ్మాటికీ అక్కడికే వెళ్ళుంటుంది."

ఇట్లు వీరు తలపోసికొనుచున్నారు. నూతికి వెళ్ళినవారు వచ్చినారు. సూర్యనారాయణయు లాంతరుగొని నూతికి వెళ్ళి, పాదప్రక్షాళనముచేసి వచ్చినాఁడు. శేషించిన మినుపసున్నియు అడుకులు కాఁజేసినారు. ఎక్కడివా రక్కడ వసారాలోనే పక్కలు వేసినారు. సూర్యనారాయణ, రంగరావు ప్రసంగములు మొదలుపెట్టినారు. కృష్ణవేణి అంతర్ధానమునకుఁ గారణము సూర్యనారాయణ తెలిపినాఁడు. తనయూహించినది తప్పనందునకు రంగరావు తృప్తిపడినాఁడు. శ్రీశైలమున జరిగిన ఆ శిశుహత్యను గుఱించియు, ఆ స్త్రీహత్యనుగూర్చియు రంగరావువలన విని సూర్యనారాయణ ఖిన్నుఁడైనాఁడు. కృష్ణవేణిజాడ అరయనేరక ఆందోళన పడ్డారు. క్రొత్తగా నేస్తురాలైన కర్నూలు అమ్మాయివారెవరేని కృష్ణవేణి అంతర్ధానమునకుఁ గారణమైయుందురా అని తనసందేహమును రంగరావు సూర్యనారాయణకు సూచించినాఁడు.

చాలసేపటివఱకు నిద్రపట్టలేదు. సూర్యనారాయణ దీపపు వెలుతురున చేతి గడియారము చూచి—

"పన్నెండు దాఁటింది"-అన్నాఁడు. లోనగదిలో నున్న వారు ముసలమ్మను మెల్లఁగా నడపించుకొనుచు మూటలు భుజములకుఁ దగిలించుకొని వెలుపలికివచ్చి స్టేషనుదారి పట్టినారు. మఱొక్క-పదినిమిషములకు సాధుజీ లేచి సంచియు చెంబును చేకొని...

"బాబా, ఆజ్ఞ... ...—"-అన్నాడు.

"చిత్తం-అనుగ్రహ ముంచండి. ట్రెయిను వచ్చే సమయమైంది కాబోలు. అబ్బా చీఁకటే పట్టాలుదాఁటిపోవాలి- అని సూర్యనారాయణ వగచుచుండఁగనే సాధూజీ నిష్క్రమించినాఁడు.

---

## ౭. ప్రకరణము.

నాఁడు ఆదివారము. రెండుజాముల వేళ హోటలులో భోజనముచేసి తాంబూలచర్వణము జేయుచు, ఎడమచేత ముంగురులం దడవుకొనుచు తలవంచుకొని రాగయుక్తముగా నేదియోపాడుకొనుచు తిరువల్లిక్కేణియందలి ప్రెకాఫ్ట్సరోడ్డుదాఁటి విక్టోరియాహాస్టెలు వైపునకు నడచుచున్నాఁడొకయువకుఁడు. కొంతదూరమేఁగి మణికట్టుగడియారము

చూచుకొని మార్తాండు నొక్కమాఱు పరికించినాఁడు. తిన్నఁగాబోయి బికింగ్ హామ్‌లాడ్జివద్ద ఆగినాఁడు. ఆతని పసిమినిమ్మపండువంటి శరీరచ్ఛాయలో కోమలతయున్నది. మలిచినట్లున్న అవయవస్ఫూర్తియందు పాటవమున్నది. దైనందిన క్షురకర్మానుష్ఠానమునఁ జెక్కులు మెఱుఁగెక్కినవేకాని గఱుగుబాఱలేదు. సులోచనాచ్ఛాదితములయ్యు విశాలలోచనములు విలాస భాసులము లయ్యేనే కాని వికార మనిపింప లేదు. చిలుక లాసింపని దొరపండు. దర్శనీయ మగుమూర్తి.

బెంగాల్ హాఫ్‌స్లిప్పర్ల మ్రోఁత చాపుతాళము ననుకరింప టకటక లాడ్జిమేడమీఁదికి వెళ్లినాఁడు. తన గదితాళము తీసి లోపలి కేఁగి తలుపు మూసినాఁడు. షర్టు విడిచి కొక్కమునకుఁ దగిల్చినాఁడు. గోడఅద్దములో ముఖము జూచుకున్నాఁడు. మొగముఁగ్రమ్మినచెమటను తువాలుతో నద్దికొని సులోచనములనుతీసితుడిచి యలంకరించుకొన్నాఁడు. క్యాంపు కాటుమీఁద- పక్కచుట్ట కానుకొని పరున్నాఁడు. ప్రక్కన బల్లమీఁదనున్న 'న్యూఇండియా' పత్రికఁదీసి విచ్చి. కడమ భాగములను స్థాలీపులాకన్యాయముగఁ బరికించినాఁడు. అంతట 'లాపుస్తకముం గొని గఱుతువెట్టినభాగము దెఱచినాఁడు కుడిచేయి పుస్తకమును బట్టినది. ఎడమచేతిప్రేళులు మొలక మీసములను పుణుకుచున్నవి. పుటయైనఁ బూర్తిగఁ బాఱ జూచెనో లేదో విసువుతో దానిని మూసి క్రిందవైచినాఁడు.

ఎడమచిటికెన వ్రేలిరవయుంగరమును కుడిచేతివ్రేళ్లతో ముందు వెనుకలకు జరుపుచు, కిటికీలోనుండి బయలును చూచుచుఁ బరధ్యానమునఁ గొంతవడి గడపినాఁడు. చివాలునలేచి కోటు జేబులోని భగవద్గీత తెచ్చుకొని యథాపూర్వముగ పక్కచుట్టకుఁ జేరగిలఁబడి గ్రంథము దెఱచినాఁడు. పుటలఁబొరలించినాఁడు. కర్మయోగము వచ్చినది—

"తస్మా దసక్త స్సతతమ్ కార్యమ్ కర్మసమాచర,
అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః."—

అజ్ఞాని యగువాఁడు కర్మముచేయవలయును. కావున నీవు ఫలము నపేక్షింపక విహిత మగుకర్మము ఎల్లప్పుడును చేయుచుండుము. ఫలము నపేక్షింపక కర్మము జేయుపురుషుఁడు సత్త్వశుద్ధినొంది క్రమముగా మోక్షశుద్ధి కర్హుఁడగును" అని చదువ నారంభించినాఁడు—

"ఏమండి సార్ రామచంద్రరావుగారీ" అని తలుపు దట్టుచుఁ బిలిచినాఁడు వెలుపలినుండి యొకఁడు. రామచంద్రరావు దిగ్గనలేచి తలుపు తెఱచినాఁడు— పోస్టుమాను రెండు జాబుల నందిచ్చి వెళ్లినాఁడు. రెండును కవర్లు. అం దొకదానిని విప్పినాఁడు— అగ్రభాగమునఁజూచి 'బెజవాడ'అని ఆ ఇంగ్లీషు జాబును చదివికొన్నాఁడు— కన్నులు తెలివికిఁ దప్పినవి. ముఖమును ఖిన్నత గప్పినది. చూపులు బయలునకుఁ బఱచినవి. రెండవజాబు విప్పి చూపులను మఱల్చిచూచినాఁడు 'విశాఖపట్నము నుంచా?' అనుకొని ఈ తెలుఁగు జాబున నైదారు పంక్తులు చదువునప్పటికి లోచనములుసహజచతురత సమార్జిం

చినవి. ముఖమును గ్రసించిన ఖిన్నత పరాభూతమైనది. జాబూ సాంతముగఁ జదివినాఁడు. బెజవాడ జాబు మరల నొకమాఱు ఓపికగఁ బాఱజూచినాఁడు. ఎడమచేతి వ్రేళ్లు మరల మీసముల నాశ్రయించినవి. ఇంచుక ఊర్ధ్వగతిజెందినచూపు కిటికీపైనున్న రామకృష్ణ పరమహంసపటముమీఁదఁ బడినది. కొంచెము సేపు తదేకధ్యానమునఁ గడచినది—

"వసంతే వాసంతీ కుసుమ సుమారై రవయవైః
భ్రమంతీమ్ కాంతారే బహువిహితకృష్ణానుసరణామ్
అమందమ్ కందర్పజ్వరజనిత చింతాకుల తయా
వలద్బాధామ్ రాధామ్ సరస మిద మూచేసహచరీ."-

అని గీతగోవిందములోని శ్లోకము మెల్లగఁ బాడుచు లేచి లెటర్ ప్యాడ్ తీసికొనిమంచముఁజేరి కూర్చున్నాఁడు. అంతలో నేదియో అక్కఱపడినది! వెంటనే లేచినాఁడు. చేతిగడియారముఁ జూచుకొన్నాఁడు. వెలుపలి వరెండాలోనికి వెళ్లి ఉత్తరదిక్కునను న్న విక్టోరియాహాస్టెలువైపు జూచినాఁడు- కుతూహలముతోఁ బడమటి దిక్కునకుఁ జూపు మఱల్చినాడు- అటనుండి గదికడకుఁజేరుచు గ్రీవముఁ దూర్పుదెసకు మలఁచినాఁడు- సముద్రశాంతతను విశాలతను గాంచుచుఁ గొంతసేపు నిలిచినాఁడు- గదిఁ బ్రవేశించినాఁడు- బల్లమీఁద జెల్ల చెదరగనున్న పుస్తకములను పొందికగాఁబెట్టి కుర్చీ మీఁదఁగూర్చుండి జాబు వ్రాయ నుద్యోగించినాఁడు— కలమునకై వెదకినాఁడు; జ్ఞప్తివచ్చినది. లేచి కోటుజేబునుండి

తీసి, దీనికై లేచినతాను దానిని మఱచి ఎక్కడెక్కడనో తిరిగితినే యని తన విస్మృతిందలంచి ఎగతాళిసగవుఁ దల యూడించుకొన్నాఁడు- కుడిచేయి కలము బట్టినది. ఎడమమో చేయి బల్లపై మోసినది. తత్కరాంగుళులు కొంతసేపు చికురములపైఁ జరలాడి, సులోచనముల సవరించి, మీసములతోఁ జెలిమి నెఱపుచున్నవి. "సౌ॥ చెల్లాయికి" అని వ్రాసినాఁడు. తరువాత వ్రాయువలయుదాని నాలోచించినాఁడు— "ఆశీర్వచనములు" అని శిల్పివలె నాపియాపి క్షణమున కొకయక్షరమును జెక్కినాఁడు- తరువాత?—ఆలోచన. తోఁచినదానిని వ్రాయ నిష్టముకాదు. ఇష్టముగలఫణితి యూహింపరాదు. తనలోని యుత్సాహము నంతయు నొక్కమ్మడి నొలికింపవలయు నని అభిలాషము. ఛాందసమార్గ మగు నని జంకు. మరల నింకొకమాఱు విశాఖపట్నముజాబువిచ్చి చదువుకొన్నాఁడు.—

"మ్లానస్య జీవకుసుమస్య వికాసనాని
సంతర్పణాని, సకలేంద్రియమోహనాని,
ఏతాని తే సువచనాని, సరోరుహాక్షీ
కర్ణామృతాని, మనసశ్చ రసాయనా,"ని *

---

* "మ్లానజీవితప్రసూన సంజీవులు,
తృప్తిదములు మోహితేంద్రియములు,
నీసుభాషములు, నీరజాతేక్షణ,
శ్రవణసుధలు హృదయసాయనములు"—ఉ. రా. చ.

అని శ్లోకమును పాడుకొనుచు వ్రాయ నుంకించి చే యాడించుచున్నాఁడు— అక్షరముపడదు—చివరకు—కొంతవడికి "జా బందినది—" అని వడిగనే వ్రాసినాఁడు. తరువాత?— మరల యోజన. మనస్సున నిశ్చయ మేర్పడినదికాఁబోలు!—

"రేపు బయలుదేఱుదును"—అని వ్రాసి చేతిగడియా రము చూచుకొన్నాఁడు— నాలుగింటికిఁ బది నిమిషములు కొఱఁత- జాబు కవరులో నుంచి శిర్ నామా వ్రాసినాఁడు— షర్టు తగిలించుకొన్నాఁడు- అలవాటు చొప్పునఁ గాళ్లు జోళ్లలో జొచ్చినవి. బయలు దేఱి ఫర్లాంగుదూరము పోయినాఁడు- తపా లుపెట్టెలో జాబుపడవేసి, హోటలునకు వెళ్లినాఁడు— ఏది యో చిఱుదిండియైనది. కాఫీ పుచ్చుకొనుచున్నాఁడు— గదికి తాళము వేయకయే వచ్చితి నని స్మృతివచ్చినదికాఁబోలు!— బమ్మెరవోయిన చూపుతో తొందరగా కాఫీముగించి బయటి దుకాణములో వక్కాకుపుచ్చుకొని వేసికొనుచు రివ్వున లాడ్జి చేరినాఁడు— తెఱచినతలుపులు తెఱచినట్లున్నవి. తన తెఱపు మఱపులకు వింతపడినాఁడు—

సాయంకాలమువఱకు ఎట్లోకష్టముగఁ గడపినాఁడు— గడ్డముమీఁదఁ కత్తి త్రిప్పినాఁడు— కామినియాఁఆయల్ రాచి క్రాపుదువ్వినాఁడు— సోపుతో ముఖప్రక్షాళన మైనది. సీమా జామా అలంకారమైనది. సులోచనముల ధరించినాఁడు- అద్ద

ములో నొక్కసారి ఆపాదమస్తకముగఁ జూచుకున్నాఁడు; అర కొఱలు సరిదిద్దుకున్నాఁడు. మూలనున్న స్లిప్పర్లను తట్టి తొడిగినాఁడు- హంటింగ్ కేన్ చేపట్టినాఁడు- మఱొకమాఱు అద్దమును దర్శించినాఁడు- దొరకొడుకువలె సిద్ధమైనాఁడు- తలుపు తాళము వేసి తాపలుదిగినాఁడు. రోడ్డుమీఁదికివచ్చి పాకెట్టు తడవుకొన్నాఁడు. మేడమీఁదికిఁ జని తలుపు తెఱచినాఁడు- మంచముమీఁదఁ బక్కచుట్టపైఁ బెట్టి మఱచిన మనీ పర్సును వెంటనే జేబులో వేసికొని జ్ఞప్తితో తాళము వేసి టవునుకుఁ బయనమై వెడలినాఁడు.

---

## ౮. ప్రకరణము.

సముద్రపుగాలి తిరిగినది. సాయంకాలము మూఁడు గంటలు పంటలక్క అవధాన్లరామమ్మ వంటవసారాలోనుండి తలమీఁది ముసుఁగు సరుకొనుచు సన్నగొంతుకతో—

"బంగారు లేడికై పాఱె రాఘవుఁడూ
అంగన నటవీడి యరిగె లక్ష్మణుఁడూ
సీతమ్మఁ గొనిపోయెఁ జెనఁటి రక్కసుఁడూ
అతఁడె ననుజుండు నన్ను రాముండూ"—

అని పాడుకొనుచు నడిమింటి దక్షిణపు గదివద్దికిఁ బోయి, గుమ్మము పట్టెలమీఁద రెండుచేతు లానించి ముందఱికి మొగ్గి—

"రంగనాయకమ్మ తల్లిగారికి ఇంకా నాటకంబడలిక తీఱిందికాదు కామోసు: చల్లార్తే ఇడ్డెన్లు సైంచ వంటారు-కారప్పొడుం చేశాను- కాఫీ కాచాను"- అన్నది-

రంగనాయికమ్మ పక్కమీఁద నుసులుచు—

"అప్పుడే పొద్దయిం దటమ్మా!" అన్నది.

"మరేమిటి!- పంతులవారు ఫలహారానికి వచ్చే వేళ కూడా అవుతేను!"

"ఆవిళ్లేచిందా?"

"తెలవదు"-అని "అమ్మాయ్"- అని పిలిచినది వంటలక్క--

"వస్తున్నా" అన్నది అమ్మాయి.

అభ్యంజన మైనది కాఁబోలు!-వినీలకుంతలములు విరియఁబాఱి వెన్నునం దంతటను పనపఱుచుకొన్నవి. కను బొమలనడిమి కుంకుమబొట్టు చెక్కుచెదరలేదు. కంటికాటుక మాయలేదు. కట్టిన జరీకమ్మిచీర, తొడిగిన రోజాపట్టు జాకెట్టు నలఁగలేదు- ఇట్లు అమ్మాయి మెట్లుదిగుచున్నది. కనులు నులుముకొనుచు గదిగుమ్మమున నిలువఁబడిన రంగనాయిక అమ్మాయినిఁ జూచి—

"ఏమిటోయ్ దేవలోకంనుంచి దిగుతున్న ట్లుందే! రేపటికి........"-అని లేతనవ్వు నవ్వినది.

కనుల మొలిచిన మెలనవ్వు అరమోడ్పు తెప్పలలోఁ దల దాఁచుకొన్నది- మొగమునఁ దొలకరించిన నునుసిగ్గు దొంతరలు అవనతశిరము మఱుఁగు జొచ్చినవి. ఆ చిఱునగవుల మొలకలు, ఆ నునుసిగ్గుల మొలకలును, నెమ్మదిని బొంగినవలపు పాలమీఁగడతరగ లని కవియైనవాఁడు వర్ణింపక విడుచునా? చెలిమితులకించిన యలుకతో విలువిడిన ములికివలె, ఫలముగాంచినచిలుకవలె అమ్మాయి సఱ్ఱునవచ్చి రంగనాయిక సందిటఁ జొచ్చెను. అట్లే ఇరువురు మెలివేసికొని దొడ్డి వసారాలోనికి వెళ్ళి పూలమొక్కల కుంపటులవద్దఁ గూర్చుండిరి. ఉపాహారమైనది- మధ్యాహ్నాలులోనికి వచ్చుచు,

"ఏదే కృష్ణా, నిన్న వాయించిన 'నినువినా నామదెందు' మఱొక్కమాటు వాయించూ! కనులకు నీ సొగసెంతో అన్నచోట ఏమిటో కొత్తసంగతు లేశావు!-ఒరేకుఱ్ఱాడా మేడమీఁదినుంచి వీణ జాగర్తగా పట్టుకొస్తావ్? పాపంచాళ్ళ మీఁద వేశావుసుమీ నీ పుణ్ణెమ్!"- అన్నది రంగనాయిక- కుఱ్ఱవాఁడు మేడమీఁదికిఁ బరువెత్తినాఁడు- కృష్ణ తలవంచుకొని చేతిగాజులు చూచుకొనుచు,-

"అలానే వాయిస్తానుగాని నువ్వుమాత్రం 'శ్రీరఘువర' కృతి వాయించకేఁ!- వచ్చిందిమొదలు బతిమాలు

కుంటున్నానుగదా! ఎవళ్లైనా నేర్చుకుపోతా రని కుళ్ళు పోతుతనం!"—

"ఏమిటే నాకా కుళ్లుబోత్తనమ్! నీవే అంటున్నావా? ఇం కెవ్వరైనా అంటారా? మా యింటాబంటాలేని మాటన్నా వేమిటే!"

"అబ్బా! ఒక కుళ్ళుబోత్తనమేనా? ఒకకుచోద్దమేనా? అన్న అన్నే, చెల్లెలు చెల్లెలే!"

"ఈ నడుమ వీణ ముట్టుతూవుంటే నువ్వ పెట్టేదే ఒట్టు. అలవాటు పూర్తిగా పొయ్యింది- అంచేత వాయించటానికి బిడియమేస్తుంది-"

" పర్వాలేదులే! ఇక్కడ నీకు బహుమానా లిచ్చే వారెవరూ లేరు- నాకూ అలవాటు పోయిం దమ్మా! ఏదో వచ్చినట్టు వాయిస్తాలే- క్షమించు"--

కుఱ్ఱవాఁడు వీణ తెచ్చిపెట్టినాఁడు. దక్షిణపుగదిలో కృష్ణా-రంగనాయికలు తివాచీమీఁద గూర్చుచున్నారు. కృష్ణ శృతిమేళవించి: 'నినువినా' కృతివాయింపఁ దొడరినది--

" అ దేమిటే సుతారమ్! మూగదానికి మల్లే! పాడుతూ వాయించరాదూ?"- అన్నది రంగనాయిక- సిగు పెనఁగొన్న చిఱునగవు బలవంతముగ నాపికొని పాడుచు వాయింపఁగడంగినది కృష్ణ- 'భానువంశతిలక నీదు భక్తుఁ

డనుచు పేరుగనుకా' అని అను పల్లవి ఆఱవసంగతి వాయించు చున్నది. రంగనాయిక ఒడలు దెలియని యుల్లాసముతో శిరఃకంపనము జేయుచు-

"నీశారీర మేమీ తగ్గలేదు సుమీ!"-అన్నది.

"రంగనాయికమ్మగారు—— అద్దంకి రా మా రా వు పంతులుగారు"- అని శిర్నామా చదివి పోస్టుమాను జాబును గిరవాటువేసినాఁడు. కృష్ణవేణి వీణాగాన మాపినది. రంగ నాయిక పరువునవెళ్ళి జాబుగొని తత్క్షణం కవరుచించి జాబు దీసితనలోఁ జదువుకొనుచు వచ్చినది. కృష్ణ తనకుఁ జూపు మన్నది. రంగనాయిక బింకము చూపినది. చూపకున్నఁ దన మీఁద ఒట్టుబెట్టుకొన్నది కృష్ణ. ఇరువు రొకింత ఇగ్గుమొగ్గు లాడినారు. తుదకు కృష్ణ జాబు నొడిసి లాగినది. చదువుకొని-

ఇం తేకదా! ఈమాత్రానికే ఇంతమూరామ టే!" అన్నది ఇంతలోఁ బదుగురు పార్టీలతో మాటలాడుచు గృహమేధి రామరావు కోర్టునుండివచ్చి కచేరీసావడిఁ బ్రవేశించి, కోటును తలగుడ్డను తీసినాఁడు. సేవకుఁడు కుట్టివాఁడు వెంటనే వాని నందుకొనిపోయి గదిలోఁ దగిల్చినాఁడు. రామరావు పడక కూర్చీమీఁద బరుండి--తలగోకికొనుచు-

"చూచారూ, సింహాచలంగారూ, మన మూఁడో సాక్షి—ఆయనపే రేమిటీ?—ఆ . . . రా జండీ! . . ."

"బంగారు రాజు గారా అండీ?"——

"ఆఁ—బంగార్రాజు- ఈవాళ మతాబా కాల్చేశే వాఁడే కాస్త నేను పరాగ్గా ఉండిఉంటేను. చప్పున హెచ్చరించానేమో సర్దుకున్నాఁడు. అంతమటుకూ—తెలివైనబుర్రే. జడ్జీగారప్పుడే నాకేసిచూచారు. టకీని ఒకముక్క—వేశేశాను—అతికింది. లేకుంటే ఏమయ్యేది?—కేసంతా అడ్డంతిరిగేది; చేసిన పనంతా పలాము లయ్యేది-ఒప్పుకుంటారా?" తలగోక్కొనుచు- "సమయంలో వెనుకూ ముందూ తడువుకుంటూ బిక్క—మొగ మేశామా-వ్యవహారం చెడ్డ దన్నమాట-ఒప్పుకుంటారా?"

"మరేనండి"

"చూశారూ, ప్రతివాదిచేత అవకతవకలు పేలించాను. మాడుగుల మెస్టేటుకీ, కశింకోటవారికీ తనకూ లావాదేవీలున్నాయని యేమి టేమిటివో చెప్పబొయ్యాడు- చివరకి ఏమీసమ్మంధంలే దని వాగించానా? వాడి స్టేటుమెంటుకీ వాజ్మూలానికీ తేడా చూపించాను. వాడిప్లీడరు కాస్తగడుసువాఁడే. ఈ ప్రశ్న అడగ్గూడ దని ఆక్షేపించాడు. కాని ఎవిడెన్సు ఆక్టులో ఏదో చూపి మసిబూసి నేరేడుగాయ చేశేశాను. తెలివితక్కువ పెద్దమ్మ ఆ ప్లీడరు కనుక్కున్నాఁడు గాఁడు. తెల్లమొగ మేశాఁడు. జడ్జీగారికూడా కాటు కేశేశాను. అవతలివారి తెలివి తక్కువవల్లను ఇవతలివారు గెలుస్తుంటారు-ఒప్పుకుంటారా? కోర్టువ్యవహారా లంటే వట్టిజూదాలు-ఈలాంటి వ్యవహారాల్లో ప్లీడరన్నవాఁడు కాస్తంత

మెలకువగా వర్తించాలి. మన జడ్జీలాంటి వాళ్ళదగ్గర తెలివి తేట లంతగా పనికిరావు. ఆయనచెప్పిందానికి బుఱ్ఱవూపుస్తూ మందహాసం చేస్తుండాలి. జడ్జీఅయినా చెడ్డవా డని చెప్పను. లా అంటే ఏశ్లోకంలోవుందో ఆయనగారికి తెలవదు. ఆర్గ్యు మెంట్లు చెబుతుంటే ఆఫీసు కాకితాలమీఁద సంతకాలు పెడు తుంటాఁడు. దిక్కు-తోచక కేకలేస్తా డన్నమాటేకాని మొత్తా నికి మంచివాళ్ళలో చెప్పుకోతగ్గవాఁడే!- ఒప్పుకుంటారా? ఏదో బారిస్టరీ ప్యాసయ్యాఁడు- తండ్రిగారి ప్రాపకం అక్కర కొచ్చింది- ఇంతకూ అదృష్టం పట్టింది. మునసబైన మూఁడేళ్ల కంతా సబుజడ్జీ అయ్యాఁడు. ఇప్పుడు అక్టింగుజడ్జీ” ఐ కూ చున్నాఁడు—ఇదో అదో అనేటప్పటికి ఖాయ మౌతుంది. ఏమిటో ఈ కోరట్లూ, ఈ లాయర్లూ, ఈ జడ్జీలు—అంతా తగాయిదాలు పెంచటానికే కాని తెంచటానిక్కాదు. ”—

అనుచు రామరావు శ్రమ నభినయించుచు గోడగడి యారమును జూచెను. ఐదు గంటలు కావచ్చెను.

“సరే మీరువెళ్ళండి! వచ్చే నెల్లోగదా ఆర్గ్యుమెంటు; మీరు రెండురోజులు ముందుగానే రాండి. అలహాబాదు, మద్రాసుహైకోర్టుల తీర్పులు మనకు ఆధారా లున్నాయి లెండి. కలకత్తాహైకోర్టు తీర్పొక్కటి మనకు కాస్తంత ప్రతి కూలంగా ఉన్నట్టు కనిపిస్తుంది. కానీండి చూదామ్! ఫీజు పూర్తిగా పట్టుకురండేఁ! వాయిదాలువేస్తే కాదు? హియ

రింగునాటికి ఝూడాగా యిచ్చేస్తా మన్నారు! ఏమిటో ఖాతాదార్ల నంత నిక్కచ్చిగా అడగలేము. మఱవకండి! ఇంత మొగమాటం లేకుండా అడుగుతున్నా నని అను కోకండేఁ! స్నేహానికి స్నేహమే— వ్యవహారానికి వ్యవహారమే! రెంటికీ ముడిపెడితే వికటిస్తుంది—ఒప్పుకుంటారా? ఆఁ—అన్నట్టు అస్సల్ నెంబరు 676-అప్పీలు వేయరూ? అపీలు వాయిదా దగ్గర కొస్తూం దనుకుంటాను. మరిగంటే 304 of 09 లో జప్తుకు పెట్టించారా? వాడి కేవన్నా చరాస్తి వున్నదీ?"

"లేకేమిటండీ చేతికొచ్చిన *సొమ్ములు దిట్టమైనవి నాలుగుజత లున్నాయి."

"ఐతే తకరర్ లేదు. సరే వెళ్ళండి."

అనఁగానే ప్లీడరుగారికి వందనాలుచేసి క్లయంట్లు సెలవు పుచ్చుకున్నారు. రంగనాయిక నడిమింటి కిటికీలో నుండి—

"రారూ?" అన్నది. రామరావు తలగోక్కొనుచు లోనికి వెళ్ళినాఁడు. కాళ్ళు మొగము కడిగికొని ఉపాహారము చేయఁ గూర్చున్నాఁడు. రంగనాయిక ఒడిలోని జాబు రామరావు వద్దికి విసరి, కాఫీ చల్లార్చుచున్నది. కృష్ణ ఉగ్రాణపు గదిలోఁ జేరినది. రామరావు ఎడమచేత జాబు విచ్చి చూచుకొని—

---

* పశువులు.

"పరే"—అని రంగనాయికవంకకు విసరి తలగోక్కొనుచు ఉపాహారము చేయుచున్నాడు.

"ఏమిటి తరువాతి సంగతి? తిరిగీ వాడు పరీక్షకు వెళ్ళాలా? వారం రోజులన్నా ఉంటా డని తోచదు."—అన్నది రంగనాయిక.

"ఏమిటో ఆలోచించు నువ్వే. ఇంకా ఈనెలాఖరు దాకా పెద్ద సూట్లున్నాయీ! వాయిదా లివ్వడు జడ్జీ. అందులో విచారణమధ్యంలో ఉంటే వాటికి వాయిదా లడగడమూ సబబుకాదు. నాకు రావటానికి అవదు. నువ్వూ వెళ్ళకుండా వుండడమే మంచిది. ఐనా వెళ్ళి మనం చేసే దేమన్నా వున్నది గనుకనా?

"అదేమి టండీ అంతా కొత్తరకంగా మాట్లాడుతున్నారు! ఏదో కలిగింది మార్పు."

"మార్పేమిటి! మార్పూలేదు- కూర్పూలేదు. ఉండే విషయం చెప్పాను. మనం పైపైన ఉండి ఏదేనా సాయం చేస్తూ ఉండడం బాగుంటుంది. కాని అందులో మనమూ చేర్తే ప్రయోజన మేమిటి? సంఘసంస్కరణ మనేది క్రమంగా చేయవలసిందికాని అట్టే ఒక్కమాటు చేయటానికి వీల్లేంది-ఒప్పుకుంటావా? అలా అయితే అది విప్లవపద్ధతై ఊరుకుంటుంది. అపాళంగా అసలే స్తంభించి పోతుంది. పూర్వా

చారపరాయణాల్ని కూడఁ గట్టుకుంటూ రావాలి. అదేమిటో కోప మావేశించి నట్టుంది! నా కేసి చూడూ!"

"కానీండి మీ ఉపన్యాస మంతాను. మగాళ్ళకోప మేమేనా చేస్తుందికాని ఆడాళ్ళకోప మనఁగా ఎంత?-ఆడాళ్ళ నఁగా ఎంత?" "నీ వర్థంచేసుకోకండా అవసరపడు తున్నావు. నా లాంటివాఁడు ఈ లాంటి వ్యవహారాల్లో కలుగ చేసుకుంటే లావు చిక్కు- లున్నాయి-ఒప్పుకుంటావా? ఏమిటి తల విసురు తున్నావు? నీధోరణి నీదేకాని కాస్తంత సంగతి-సందర్భాలు వినిపించుకోకపోతె ఏలాగ?"

"అంతా మనం నడుంగట్టుకొని చెయ్యవలసిందానికి ఎవరోపరాయిాలు మాట్టాణ్ణెట్టు మాట్టాడితే ఏం చెప్పటం?"-

అనుచు రంగనాయిక కాఫీకప్పుచేతి కందిచ్చి లేవఁ బోయినది- రామరావు పుచ్చుకొనుచు, "కూచో ఇంతలోనే సాధింపా? నీవన్నట్టు నడుంగట్టుకొని చెయ్యవలసిందే తకరర్లేదు. ఇం కొకరివిషయం చెప్పు; డంకాకొట్టి నిలవబడితాను. స్వవిష యంలో అంటే కాస్త జంకవలసి వస్తున్నది, ఎవ్వళ్ళూ ఇక్కడ మనతో కలిశేవా రున్నట్టు కనబడరు-ఒప్పుకుంటావా?"

"చెయ్యటానికి త్రికరణశుద్ధిగా పూనుకుంటే ఇన్ని కుతర్కాలకే అవకాశం లేదు. ఒకళ్ళ కోసమా?"

నీకు బోధపట్టం లేదు. యేమన్నా అంటే నన్ను మింగేసేటంతకోప మొస్తుంది. నలుగురూ పోగై ఉత్సాహంగా

చేయువలసినకార్యమానా? కలిశివచ్చేవారు ఈవూర్లో లేరని నే నంటూ వుంటే—ఒప్పుకుంటావా?

"ఏమి టంతా విచిత్రంగా మాట్లాడుతున్నారు! రజస్వలావివాహాలు తప్పక జరగాలనీ, బాలవితంతువులకు పెళ్లిళ్ళు చేయకపోతే వాళ్ళకళ్ళనీళ్ళు మన సంఘాన్నీ దేశాన్నీ మాడ్చివేస్తా వనీ—వ్యాసాలు వ్రాస్తుంటారు. మొన్న సంఘసంస్కరణసభకు మీా రగ్రసనాధిపత్యం వహించి ఇచ్చినఉపన్యాసాన్ని విన్నవా రందఱూ కళ్ళ కద్దుకున్నారు. ఇప్పుడు తీరా సమయానికి మొగం చా టెయ్యటానికి ప్రయత్నిస్తున్నారు."

"ఆకథ వేరు; నీకు బోధపట్టంలేదు. లోకుల అభిరుచిని బట్టెన్నీ ఉద్రేకాన్నిబట్టెన్నీ మాట్లాడాలి- ఒప్పుకుంటావా? ఇంట్లో నాలుగ్గోడలనడమాఉండే మీా కేం తెలుస్తుంది లోకభోగట్టా? మన మీాలా చేయబోతున్నా మని ఊళ్ళో పోరు లావైంది.కనక నామాటవిని వాళ్ళనీ ఏ రాజమండ్రికో ఏ ఖరక్పూరికో వెళిపోయి కార్యం ముగించుకు రమ్మను. ఆనెకచూతాం".

"ఆనెక చూచే దేమిటి; నలుగు రే మనుకుంటారు?"

"ఏ మనుకుంటారు? ఏ మనుకుంటే మనకేం?

ఎవడెవడి ఇబ్బందులూ, ఎవడెవడి సమయాసమయాలూ ఎవడెవడి సాధకబాధకాలూ ఒకళ్ళ కెల్లా తెలుస్తాయా? అనుకునేవాళ్ళందఱూ ఆచరిస్తూన్నారా?— ఒప్పుకుంటావా?

"చెప్పినలాగా చెయ్యకపోవటం నగుబాట్లబేరం అవుతుం దంటున్నాను,"

"అర్థమయ్యింది. వట్టిదద్దమ్మకిందే కట్టేస్తున్నావు. చేసేదంతా చెబుతున్నామా? చెప్పేదంతా చేస్తున్నామా? చెప్పకనే చేసేవా రున్నారు. చేయకనే చెప్పేవారూ ఉన్నారు. చేసిందాన్ని చెప్పటమూ, చెప్పిందాన్ని చేయటమూ లోకాచారానికి విరుద్ధంగాఉంటుంది— ఒప్పుకుంటావా? కనక..."

"మీతో వాదించగల్నా? ఎవ ళ్ళే మనుకున్నా సరే. అన్న మాట చెల్లించాలి. ఇక్కడే జరగాలి. మాస్త్రీసమాజంవాళ్ళలో చాలామంది లావు ఉత్సాహంతో ఉన్నారు. మొన్ననే మీరు చేతులో చెయ్యివేశారు; నామీంద ఒట్టెట్టుకున్నారు. ఆ మా టన్నా నిలుపు కుంటారా?"

అనగానే, రామరావు తలగోకికొనుచు—

"సరే ఆలోచించు. నీ కున్నంత అభిమానమూ, నీ కున్నంత ప్రేమా నాకూ ఉన్నది. లోకరీతి చెప్పాను. మరో హామోస్తరుగా అనుకోకు. నీ యిష్టానికి వ్యతిరేకంగా నడవను గదా?" అన్నాఁడు. రంగనాయికి ముఖము వికసించినది. ఉగాది

నాపుగదితలుపుచాటున నున్న కృష్ణను గాంచి సుస్మితముతో గనుఁగొల్పినది. రామరావు ఉపాహారమును ముగించి లేచి తల గోకికొనుచు ముందటిహాల్లోనికి వచ్చినాఁడు. రంగనాయిక మందహాసముతో విడె మందిచ్చినది. రామరావు రంగనాయిక ముఖము జూచి,—

“ఎంతసతోష మన్నా వచ్చింది!” అని పకపక నవ్వినాఁడు; కుఱ్ఱవాఁడు టోపీ కోటు ఖండువా చేతికఱ్ఱ తెచ్చి ఇచ్చినాఁడు. రామరావు వానిని ధరించి—

‘వెళ్ళొయివస్తా” అన్నాఁడు.

“ పెందరాళే వస్తారు కాదూ?”—అన్నది రంగనాయిక.

“ఆఁ”— అనుచు జోడుతొడిగికొని కఱ్ఱ త్రిప్పు కొనుమ క్లబ్బునకు దారా సాగించినాఁడు రామరావు.

---

## ౯. ప్రకరణము.

మంగళవార ముదయము ౬ గంటలకు మదరాసు మెయిలు బెజవాడ చేరినది. రామచంద్రరావు రైలుదిగి సులోచనములు సరుదుకొని, ఎడమచేతివ్రేళ్ళతో ముంగురులను దడవుకొనుచుఁ గుడిచేయి నడుముమీఁద నుంచుకొని స్టేషనుచాయఁజూచుచు నిలుచున్నాఁడు. కూలివానితో నొక

ట్రంకు మోయించుకొని కుడిచేత సైకిలు నడపించుకొనుచు ఎడమచేత సిగరెట్టుగాల్చుచు, బండిలోనివారిని, దిగినవారిని దిగుచున్నవారినిఁ బరికించుచు సూర్యనారాయణ వేగముగ ప్లాట్‌ఫారము పొడవున నడచుచున్నాఁడు. తొందరగా రెండు బారలు ముందున కేఁగిన సూర్యనారాయణనుజూచి రామచంద్రరావు చే యప్పళించుచు.—

"సూర్యనారాయణా "అన్నాడు.

సూర్యనారాయణ మరలిచూచి నవ్వుచు సమీపించినాఁడు; సైకిల్ పెడల్ మీఁద ఎడమ మోచే యుంచి—

"మొన్నగదా నా ఉత్తరం నీ కందుతా?"

"మొన్న నా?..."ఆలోచించి—"ఆఁ—మొన్న నే."

"మఱి జాబు వ్రాసుంటే నిన్నను వచ్చేదిగదా-టెలిగ్రామియ్యట మెందుకురా నిన్నను. జమీందారీ ఎత్తు అంతాను".

రామచంద్రుఁడు మందహాసముతో—

"మీకులేని జమీందారీ మా కేమిటి ఉన్నదిరా?—

ను వ్రాసిగరెట్టు పారేశి మాటాడుదూ?— మొన్నను ఏమిటి వ్రాయటానికీ తోచిందేకాదు. మఱేమిటో పిచ్చవానివాలకమైంది. ఆవేళటి నా గందరగోళమూ, నా హంగామా నాకే ఆశ్చర్యమేసింది! నీ కేమేనా ఉత్తర మొచ్చిందా?"

"అదిరాబట్టే బాబూ ఈ మాత్ర మన్నా నీతో మాట్లాడటం గలిగింది. నేనూ నీతో వచ్చి చూ చైనా వస్తా మనుకున్నాను. మొన్న నే వారంలోజులు సెలవుచ్చుకున్నాను; ఇంతలో సెల వంటే ఏడుస్తారు."

"మ రెల్లాగ?-- నువ్వు రా వన్నమాటేనా?"

"నువ్వు వెళ్ళి సంగతిసందర్భాలు వ్రాయి. ఎల్లాగో చేసి వస్తాను."

అని కూలివానితో —

"ఇందులో పెట్టు ఆపెట్టి"—అన్నాఁడు. కూలివాఁడు రామచంద్రరావు సామానుదగ్గఱనే పెట్టెఁ బెట్టినాఁడు; కూలిడబ్బులు పుచ్చుకొని వెళ్లినాఁడు.

"పెట్టి చూస్తే నువ్వూ వస్తున్నా వనుకున్నాను" అన్నాఁడు రామచంద్రరావు.

అంతట సూర్యనారాయణ "ఇదో దానిబట్టలు నగలూ ఇందులో ఉన్నాయి. కట్టుబట్టతో వెళ్ళిందిరా! ఎంత అల్లడ తల్లడమైపోం దనుకొన్నావు! వీణ పంపమని వ్రాసింది. ఎల్లాపంప ను?-- అది కాకినాడలో మామయ్యగారిఇంటివద్ద ఉన్నదా మెను!-- నేను వచ్చేటప్పుడు తెస్తా నని చెప్పు"—అన్నాఁడు

"మ రేమిటి కబుర్లు? చెల్లాయే వ్రాసిందా నీకు ఉత్తరమ్?"—అన్నాఁడు రామచంద్రుఁడు.

"ఇద్దఱూ వ్రాశారు. ఏం జెప్పు మన్నావు కబుర్లు? కాఫీ పుచ్చుకుందుగాని రా."

"అక్కర్లేదు లే—ఖైమైనట్టుంది"

"ఓ—కావలసినంత టైము. రెఫ్రెష్మెంటు కార్లోనేగా! ట్రెయిన్ కదిలితేమాత్రమేం!"

ఇరువురు వెళ్లి కాఫీ పుచ్చుకొని కంపార్టుమెంటువద్దకు వచ్చినారు.

"ఔనుగాని ప్రాక్టీసెక్కడ? మద్రాసులోనేనా?" అన్నాఁడు సూర్యనారాయణ.

"ఈ అప్రెంటిష్షిప్ అవనీ—ఆనక ఆలోచిద్దామ్" అన్నాఁడు నిరుత్సాహముగా రామచంద్రుఁడు.

గంట గొట్టినారు; రామచంద్రుఁడు బండెక్కుచు—"మఱెందుకూ ఉండిపో; తప్పక రావాలిసుమీ!" అన్నాఁడు, బండి కదలినది— నిమిషమున ప్లాట్‌ఫారము దాఁటినది.

రామచంద్రుఁడు వెళ్ళి తనతావునఁగూర్చున్నాఁడు. కమ్మయువకుఁ డొకఁడు "కృష్ణాపత్రిక" విజృంభించి చదువుచున్నాఁడు. బండిలోని వారు సావధానముగ నాలకించుచున్నారు. టర్కీయుద్ధమును గుఱించి చదివినాఁడు. ఇందుపై శ్రోతల విమర్శలును, పరామర్శలును సాగినవి. అనంతర మా యువకుఁడు, రాజారామమోహనరాయల సాంవత్సరిక

మును కూర్చి చదువ మొదలిడినాఁడు. సరే దానిని విడిచి తరువాతివిషయముఁ జదువుఁ డని శ్రోత యొకఁడు హెచ్చరించినాఁడు. శీర్షికలు చదువుఁ డన్నాఁడు మఱియొకశ్రోత! "ఒకసాధ్వీమణి సహగమనము" అని మకుటముఁ జదివినాఁడు పఠిత. "ఆఁ- ఆఁ- అ దేమిటో చదవండి"—అన్నారు శ్రోతలు కొందఱు ఏకగ్రీవముగా. యువకుఁ డిట్లు చదివినాఁడు:

"కలకత్తాలో పాతికసంవత్సరముల ఈడుగల అభినవ చంద్రభేనిక్ అనువిద్యార్థి ఈ నెల ౨౧ వ తేదీని జ్వరపీడితుఁడై మృతిఁబొందినాఁడు. ఆతని ధర్మపత్ని రాజరాజేశ్వరీదేవి పదునెనిమిదేండ్ల యువతి సహగమన మొనర్చినది. ఈ విషాదవార్తావాయువు వంగరాష్ట్రము నందంతట ప్రబల సంచలనముఁ గలిగించినది. ఈమెను ఈసహగమనమునకుఁ బురిగొల్పినా రను గుమానుతో సమీపబంధువులను కొందఱను పోలీసులు అఱెస్టుచేసి రిమాండులో నుంచియున్నారు"-

అని చదివి యాపుట తడవుగా ఖండనమండనములకు లంకించుకొన్నారు శ్రోతలు. శ్రోత యొకఁడు మహానందమును వెల్లడించుచు-" ఉంటారు మహాప్రతివ్రతలు సూటికోటికొక్కొ-కరు. ఆమె మహాయిల్లాలు కాఁబట్టి భర్తతోఁగూడా పరలోకాని కెళ్ళింది. అందఱికీ ఆభక్తి కుదురుతుందా ? ఆ తెగువ పుడుతుందా" అన్నాడు.

"ఆలాపుడితే ఇందఱు విధవలెల్లా ఉంటారండీ? మీరు క్రియముక్క సెలవిచ్చారు-నాకు నచ్చింది. భక్తి అనేది కుదరాలిగదా! ఎల్లా కుదురుతుంది?- రక్తి కుదిరినానక భక్తి. రక్తిలేని భక్తిలేదు. భక్తిలేని రక్తిలేదు. 'లోకమ్ శోకహతఞ్చసమస్తమ్' అన్నాఁడు శంకరుఁడు." అని మఱియొకశ్రోత వ్యాఖ్యానము చేసినాఁడు.

"మతవిషయాల్లో సర్కారు సమ్బంధం కలిగించుకోవటం కేవలం అక్రమ మంటాను"-అన్నాఁ డింకొకశ్రోత.

"అక్రిమమూ అక్రమమున్నర హిందూధర్మ మెఱఁగని ప్రభుత్వంలో ఈలా కాకుండా భిన్నంగా ఏలా వుంటుందండీ?"-అన్నాఁడు వేఱొకశ్రోత.

పరుండి వినుచున్న శ్రోత యొకఁడు చివాలున లేచి——

"మనకి మత మంటూ, ధర్మ మంటూ ఒక టేడుస్తున్నదిగనకనా? మీ రన్నట్టు ఆవిడ సహగమనం చేయటం ప్రశస్తంగానే ఉన్న దనండి-ఒప్పుకుందాం. ఆ బుద్ధి ఆమెకే పుట్టుంటే ఇతరు లందులో జోక్యం కలిగించుకోవటం తప్పే. అయిందా అండీ,- మీ రన్నట్టు నిర్బంధించి నిండు ప్రాణాన్ని ఆహుతి చేసేవాళ్ళది క్రమ మంటారా?- అక్రమ మంటారా? ఆలాంటి సందర్భంలో గవనర్మెంటు వాళ్ళు కాకపోతే మీరూ నేనూ ఆపగల మటండీ వాళ్ళనీ? మీ రన్నట్టు తర్కవిషయాల్లో ఎల్లావుండినా ఈ లాంటిదురాగతాల్లో

సర్కారు జోక్యం కలగజేసుకోవటం తప్పా?" అన్నాడు తీవ్రముగా.

ఒక ప్రయాణికుఁడు శిలాప్రతిమవలెఁ గూర్చుండి చూచున్నాఁడు.

"మీరు చెప్పింది నిండా బాగా ఉండాది. ఇట్టాముంచి సంగతిలో గవర్మెంటు అవశ్యంగా వచ్చిదా తీరును. మనం మాత్రం ఊరికే ఉండవచ్చునా? మనం ఏందా చేసేదానికి మాఘను?—సరిదా కానీండి సదవండి"—అన్నాఁ డొకచెన్న పట్టణముసెట్టి.

పుట పొరలించి—

"శ్రీశైలము: ఘోరమరణములు' అని పెద్దక్షరాలతో విలేఖకుఁడు వ్రాసినవ్యాసం బడ్డది— చదవమన్నారా?" అన్నాఁడు యువకుఁడు- అందఱును కుతూహలాయత్తులైరి-

"కానీ లెగండి" అన్నాఁడు కమ్మసంసారి యొకఁడు. యువకుఁ డిట్లు చదివెను:

"శివరాత్రికి ముందుదినముననే నేను శ్రీశైలము చేరినాను- నంద్యాలనుండి ఆత్మకూరువఱకు ఎద్దులబండ్లప్రయాణము సుఖముగ నేసాగినది. ఆత్మకూరునుండి నాగలూటివఱకుఁ గూడ బండ్లలో ప్రయాణము, కొంచెము కష్టమైనను సహనమునకు మించలేదు. ఆపైన రెండుకాళ్ళబండి; నడవలేనివారికి డోలి- పెద్దచెఱువుసత్రము యాత్రికులపాలి కామధేనువు- యాత్రికులకేదేని పుణ్యమనునది లభించినయెడల అది

మూడుమ్ముప్పాతికపాలు ఆసత్రముపెట్టిన దాతలకును, ఆ దాతల వితరణను సార్థకముగా వినియోగించు నిర్వాహకుల కును తప్పక చెందవలయును. పెద్దచెఱువు దాటినదిమొదలు దారి మఱీ దుర్గమము— ఱాళ్లరప్పలఁ గప్పిన ఎగుడుదిగుడు పుంత- వాలి జాఱికగానున్న తాపలు. హిందువుల భక్తి కిది అగ్నిపరీక్ష. నామట్టుకు నేను తెలియకవచ్చినందుకుఁ దగిన శాస్తి జరిగిన దని చెంపలు వాయించుకున్నాను- ఇక దారి సాగక మిడెత్తిన రేనాటి మనుష్యులుగూడ నడవ లేక ఈడి గిలఁబడినారు. ఇఁక ముసలిముదుకలగతియు స్త్రీలపాట్లును ఎట్టుండునో ఊహించుకొనవచ్చును. దారివెంట కాళ్లువిరిగి కండ్లుతిరిగి పడినవా రెందఱు! ఆబ లడఁచుకొనుచు భీముని కొలను సమీపించునప్పటికి అస్త్రశస్త్రములు నేలగూలిన వన్నమాట— ఆ కొలనులో నీరు దుర్గంధబాధురము. ఇఁక గతియేది? ఇట్టి యగచాట్లతో శ్రీశైలము చేరినాను. అచటి దేవాలయము ధర్మకర్తలపాలనమువగయిరా సంగతులను నింపాదిగా వ్రాయుదును. ప్రస్తుతము శ్రీశైలక్షేత్రమున జరి గిన ఘోరమరణములనుగూర్చి మాత్రము, నా కందిన మత లబును బట్టి వ్రాయుచున్నాను.

శివరాత్రి గడచినది— తెలతెలవారుచుండఁగా, యాత్రకు వచ్చినతఁ డొకఁడు దేవాలయప్రాకారము బయటి కోనేటిలో నీళ్లు ముంచుకొనఁ బోయెను. అందు గుడ్డలచుట్ట

యొకటి తేలి యాడుచుండినది. ఆతఁడు కేకలువేయుచు వచ్చి నలుగురికిఁ చెప్పినాఁడు. ఆ చుట్ట తీయించి చూడఁగా ప్రాణములేని మగశిశువు, నెత్తురుకందు ఉన్నది. పోలీసువారు మూగినారు. ఆ చెప్పినమనిషిని అరెస్టులోపెట్టి ఆ శిశుశవమును స్వాధీనపఱుచుకున్నారు.

తరువాత, పాతాళగంగ (కృష్ణలో) నొకస్త్రీ పడి చనిపోయిన దని పుకారు. ఆశవమును పెదచెఱువుక్యాంపు—ఆసుపత్రిలో పోస్టుమార్టెమ్ (ఛేదన) చేయఁబోవఁగా ఆమెచీర పోకముడిలో చీనారేకు డబ్బి యగపడినది. దానియందు మడఁచియుంచినకాకిత ముండినది. అది పెన్సిలుతో వ్రాయఁబడినది— స్త్రీవ్రాత— దానిప్రతి ఇందు సమోదు చేయుచున్నాను.

"నేను బ్రాహ్మణస్త్రీని. నాది కడపజిల్లాలో నొకగ్రామము. నాభర్త ఎనిమిది మాసములక్రిందటభూముతొకి కాలంచేశినాఁడు. అప్పటికి నాకు నెలదాఁటినది. క్రమముగా వేవిళ్లు కనబడినవి. ఇరుగు పొరుగు వారున్ను బంధువులున్ను నేను దుర్నడతతో కడుపు చేసుకున్నా నని సూటిపోటు మాటలాడుచుండిరి. నాతోగూడ నాపుట్టింటివారిని వెలివేశినారు. ఈ దుర్వాదుక సహించలేక మావాండ్లు మందు మాకు లిచ్చి కడుపు పోగొట్టేదానికి యత్నించిరి. వారియత్నము జరగలేదు. ఇక్కడ మొన్నరాత్రి నొప్పులుకనబడినవి-

వేకోజామున మగబిడ్డను ప్రసవించితిని. నా అన్నగార్లు, నేనెంత బతిమాలి యేడ్చినా వినక, బిడ్డను బలవంతముగా తీసకపోయినారు. ఆదుఃఖం పట్టలేకను, ఈ నిందలు పడలేకను కృష్ణలో పడడానికి నిశ్చయించుకోని పోతావున్నాను. శిశు హత్యాపాతకము నాకుతగలకుండా మల్లికేశుణ్ణి ప్రార్థిస్తూ వున్నాను. నే నేపాప మెరిగినదాన్ని కాను. పాపము పుణ్ణెము భగవంతుడే విచారించుతా డనిన్ని, సత్యము పదిమందికి తెలిసివుండవలె ననిన్నీ ఈజాబు వ్రాస్తిని"—

శ్రోతలు నిర్విణ్ణులైనారు. రామచంద్రుఁడు అచలరాజ యోగ మవలంబించి కూర్చున్నాడు.

"ఎన్నో ప్రపంచకంలో ఈలాంటి ఘోరకృత్యాలు! మన వీపు మనకుకానరాదు. పాపపుణ్యాలు పరమాత్ముడికే తెలియాలి"-

అని దీర్ఘనిశ్వాసము వదలినాఁ డొకపెద్దమనిసి.

"రెండు చిత్రమైన అగ్రెస్టులు."— అని ఉన్నది. చదవనా? "— అన్నాఁడు యువకుఁడు.

"కానీండి- కాలక్షేపముం కావలిగా! "— అన్నా డొక శ్రోత.

"శ్రీశైలమున పాతాళగంగలోఁబడి చనిపోయిన స్త్రీ అన్నగా ర్లిరువురు నంద్యాలలోఁ బట్టుబడినారు. స్త్రీ

యొక్కతల్లి ముసలామె వారితో నుండినది కాని ఆమె అరె స్టుకాలేదు. ఇందును గురించిన వివరములు:

పై వార్త తనకు నంద్యాలలో అందగానే ఇన్స్పెక్టరు నరసింగరావు వెంటనే మార్కాపురము జేరినాఁడు. సాధు వేషముతో అచటి సత్రములలో వారికై వెదకినాఁడు. చివరకు స్టేషనువద్ది సత్రములో వారినిఁ గాంచి వారిమాటల ధోరణిని, వారిచర్యలను పరిశీలించి తన గుమాను రూఢి చేసికొని వారితో అర్ధరాత్రి ట్రెయినులో ప్రయాణముచేసి నంద్యాలలో వారి నరెస్టుచేసినాఁడు." అనియువకుఁడు చదివెను.

"భేషైనపని జరిగింది"— అన్నాఁ డొక శ్రోత.

"ఏం జేస్తారు వారైనాను? సంఘానికి భయపడేగదా? లోకనింద పడలేకనేగదా?"— అన్నాఁ డొక ప్రయాణీకుఁడు.

అంతట మొగ మెర్రజేసి గ్రుడ్లురిమి—

"సంఘానికి భయపడట మేమిటండీ!—ఆతల్లిని ఆపిల్లనీ ఎడగలబెట్టరాదా? ఎక్కడేనాబ్రతుకో పొమ్మని పంపేయరాదా? స్త్రీహత్యకూ శిశుహత్యకూ ఒడిగడతారటండీ?"— అన్నాఁడు వేఱొక ప్రయాణికుఁడు. ఇట్లు కొంతసేపు ఘర్షణ జరిగినది. యువకుఁడు పత్రికలోని తరువాతి వార్తలను చూచుచు,—

"ఏమండోయ్ ఈచిత్రం వింటారా?"— అన్నాఁడు.

"ఏమిటో అదీ చదవండి—" అన్నాఁడు కమ్మసంసారి.

యువకుఁ డిట్లుచదివెను:

"గుంటూరుజిల్లా చేబ్రోలు గ్రామంనుంచి బ్రాహ్మణ స్త్రీని మగవేషం వేయించి కమ్మచౌదరి ఒకఁడు లేవదీసుక పోయినాఁడు. గుంటూరు పోలీసువారి టెలిగ్రాము డోర్ణ మొకాములో రైల్వేపోలీసు ఇన్స్పెక్టరు నరసింగరావు కంది నది. అతఁడు అత్తరుసాహేబు వేషముతో ఆయిద్దరిని ఆచోకీ పట్టి గుంతకల్లులో అరెస్టుచేసి ఇక్కడికి నాలుగురోజులక్రితం తీసుకవచ్చి ఈ పోలీస్టేషన్లో అప్పచెప్పినాఁడు. లేచి పోయిన ఈస్త్రీని, కమ్మచౌదరిని లాకప్పులో ఉంచినారు. ఈ సంగతివిని ఆవిడ అన్నగారున్ను భర్తయున్ను వచ్చి చూచి నారు. తాను విడిచిపోయిన బిడ్డను చూడఁగానే ఆస్త్రీ పెద్ద పెట్టునపడ్చి తనదుర్గతికిని తనదుర్బుద్ధికిని దుఃఖించినది. ఇంకా చార్జిషీటుదాఖలుకాలేదు."—

అని చదువఁగనే— "కర్మ! చేసుకున్న పెనిమిటిని విడిచీ, కన్నబిడ్డనువదిలీ శూద్రాడితో లేచిపోవటమా?— దీని కర్మంగాల.—" అన్నాఁ డొకశ్రోత్రియుఁడు.

"శూద్రాడితోకాకుండా బ్రాహ్మడితో లేచిపోతే ఫర్వాలే దన్నమాటగదండీ శాస్త్రుల్గారూ?" అన్నాడొక ప్రయాణికుఁడు.

"బ్రాహ్మడైతే కులంలోనన్నాఉండు నని నే నన్నా నండీ—" అని శాస్త్రిలు జవా బిచ్చినాఁడు.

"రంకుతనానికి కుల మేమిటి?- స్థలమేమిటి? మీా రన్నట్టు కామానికి కన్నులున్నాయా? అపరబుద్ధి పుట్టకనే ఉండాలి. పుట్టిందా వెళ్ళవలసిందే చివరంట."— అన్నాఁడు మఱొక పెద్దమనిసి.

" 'భ్రష్టస్యకావాగతిః' అన్నారు"— అని శాస్త్రిలు వ్యాకులముతో తలయూచుకున్నాఁడు.

"ఆ ఇనస్పెక్ట రెవఁడో దేవాంతకుఁ డయ్యా"— అన్నాఁ డిం కొక పెద్దమనిసి. మెయిలు పవరుపేట దాఁటినది; రెండు మూఁడు నిమిషములలో స్టేషను చేరినది. యువకుఁడు దిగి వెళ్ళినాఁడు.

రామచంద్రుఁడు, ట్రంకు తెఱచి, క్రొత్తఁగా గొన్న "Light of Asia" ('లైటు ఆఫ్ ఏషియా—' 'ఆసియా జ్యోతి') అను నాంగ్లగ్రంథము నుద్ఘాటించి ప్రథమాధ్యాయ మునఁ బ్రవేశించినాఁడు.



## ౧౧. ప్రకరణము.

గురువారము సాయంకాలము 3-౽గంటలవేళ- మేడ మీఁద పందిరిపట్టెమంచముపై నేకాంతముగా క్రొత్తగా వ్రాసిన గీతికలను తనలోఁ బాడుకొనుచు సందర్భశుద్ధిని, శబ్ద ప్రయోజనమును సరిచూచుకొని సవరించుకొనుచున్నాఁడు రామచంద్రుఁడు. శుద్ధశ్రోత్రియవేషముతో నడివయసు బ్రాహ్మణుఁ డొకఁడు బయటిగుమ్మమువద్దికి వచ్చి—

"పంతులవారూ"— అని పిలిచినాఁడు.

"ఎవరువారు?"— అని లోపలనుండి ప్రశ్న.

"అమ్మా, నే నండీ"— అని జవాబు.

రంగనాయకమ్మ మధ్యసావడి వాకిటికడ నిలిచి క్రొత్త చూపులతోఁ జూచి—

"ఎవరికోసం?"—అన్నది.

"రామారావు పంతులవారు కోర్టునుంచి రాలేదా అండీ?—" అన్నాఁ డా బ్రాహ్మణుఁడు.

"వారు విజయనగరం వెళ్లారు"

"ఎప్పుడు వస్తారో?"

"అసలు ఈ వా[illegible] వెళ్తా. రేపు వస్తా రనుకుంటాను."

"అన్నయ్యగారు వచ్చా రంట చెన్నపట్నంనుంచీని?"—

"ఔరే— మేడమీఁద ఉన్నాఁడు. మాట్లాడాలా?"—

"ఔరేనండి"

"వెళ్లండి ఈలా"—

అని మేడమెట్లుచూపినది రంగనాయిక. బ్రాహ్మణుఁడు సూటిగా మేడమెక్కిపోయినాడు. మనిషియడుగుల అలికిడి విని రామచంద్రుఁడు తలయెత్తి చూచినాఁడు. బ్రాహ్మణుఁడు ముసిముసినవ్వులతో, పూర్వపరిచితి నభినయించుచూపులతో, ఎరవుదెచ్చుకొన్నవినయముతో వొచ్చుకొని వెళ్లి నాఁడు.

"దయచేయండి"—అని అపరిచితదృష్టిఁ బఱపుచు కుర్చీ చూపినాఁడు రామచంద్రుఁడు. ఆబ్రాహ్మణుఁడు కూర్చుండి, చేత నున్నతడికొల్లాయితో గంధాక్షత లొత్తుకొనుచు—

"నాపేరు సత్యనారాయణశాస్త్రి అంటారండి. మాయింటిపేరు సూరివారు. మిమ్మల్ని, మీకు ౮-౯ ఏండ్ల వయసులో చూచాను—అని మేడమెట్లవెపుచూచి— ఆతరవాతనూ ఒకటి రెండు దఫాలు చూచినట్టున్నాను. మీరు మరిచారు కాఁబోలు!—మూఁడు సంవత్సరాలక్రితం మనమిద్దఱమూ మద్రాసువఱకు ప్రయాణంజేశాం- మెయిల్లో—ఇంటర్లోను"—మెట్లదిక్కు-చూచి— "అప్పుడు సర్ సుబ్రహ్మణ్యయ్యరుగారు ఏదోజోస్యంసందర్భంలో రమ్మనమనివ్రాశారు. ఆపనిమీఁద వెళ్ళుతు మనం తటస్థించాము."—అన్నాఁడు.

"జ్ఞాపకంచాలదు"—అన్నాఁడు రామచంద్రుఁడు.

"ఏమిటో ఎందర్నో చూస్తూవుంటారు. మీరు చదువేమి టో! మీరేమిటో! అంతేకాని మఱొకజోక్యం ఉండదు. ఎన్నో జ్ఞాపకం ఉంటాయి"— మరల మెట్లవంకగాంచి — "మిమ్మల్ని చూస్తే సాక్షాత్తూ నాన్నగార్ని చూసినట్టే ఉన్నది. మిమ్మల్నీ అమ్మాయినీ నే నెత్తుకొని ఆడించాను సుమండీ!"—"నేను, 'బావగారూ, అంటూగుమ్మంలోకి వెళ్ళానంటే ఎంతకమా యీషులో ఉన్నాసరే ఆపేశేసి నాపని ముందత్తిగా సర్ఫరా చేసేసేసి తమపని చూసుకునేవారు నాన్నగారు. వారి హయాంలో తాసిల్దారీ అంటే ఈరోజుల్లో గవర్నరు హోదా కూడా చాల దనండి. తాబేదార్లకు సరేసరి—ఇక పైఅధి కార్లకూ హడలే భీమశంకరం పంతులుగారంటేను. తాబే దార్లను ఘెడ్డదయగా చూసేవారు. కంటిబెదురేకాని కడుప్మీద కొట్టారామఱి! మాట ఒకపిసర దూకుడుగావెళ్ళేది— కాని మనస్సు అమృతం!" అని సోపానమార్గముసకై చూచినాఁడు.

రామచంద్రుఁడు వినుచు తలయూచినాఁడు.

"మీఇల్లు అన్నసత్రువు. ఎందఱికి పెళ్ళిళ్ళు చేశారు! ఎందఱికి అన్నంబెట్టి చదువులు చెప్పించారు! ఎందఱికి గృహ దానాలు భూదానాలు చేశారు! సర్కారుబంజ రుందిరాలంటే ఆశ్రయించేవారికి—తక్షణాదరఖాస్తుమీఁదదఖలు చేసేసేవారు. చదువురాని చవటలకి ఎందఱి కుద్యోగాలిచ్చారు! ఆశ్రయించని వానిదిలోటు. మహారాజు! మహారాజు!—ఆపుణ్యాత్ముఁడుపోబట్టే

మాబోంట్లు పరదేశాలపాలై ఈలా కిచాట్లు పడవలసిన యోగం బట్టింది! ఆ దౌకకాలం! ఆ దౌకదశ!"— తాపలదరిం గాంచి- "అల్లాంటి దర్పమయినమని షున్నాడా! మహాయోగ జాతకుఁడు! అంతా స్వప్నకల్పమైంది!" అని వ్యాకుల సూచకముగ నిట్టూర్చి-

"అమ్మగా రిక్కడే ఉన్నారా?" — మెట్లుచాయ చూచినాఁడు.

"పిన్నగారి ఊరికి వెళ్ళారు."

"పూర్వస్నేహం- ఆశ్రితుణ్ణి ఒకమారు దర్శనంచేతా మని వెళ్ళొచ్చాను. మీా రేమిటో వ్రాసుకుం టున్నట్టు ఉన్నారు. అంతరాయం గలిగించాను కాంబోలు!"

"అఁ- పర్వాలేదు లేండి"

"ఇంకా వివాహం చేసుకున్నారు కాదు గాదూ? మీా జననంసర్వధారంటూ జ్ఞాపకం— నాన్నగారు నాచేతే వ్రాయించారుజాతకం. ఉందాండీ అది?"—అని పడికట్లదెస నరసినాఁడు.

"ఏమో అమ్మగారి నడగాలి"

శాస్త్రి ముందున కొంకింత మొగ్గి దిక్కులు కలయఁగని

"ఏమి టింత ఆలస్యం చేసేశాయి? అమ్మగా రుంటే దెబ్బలాడేవాణ్ణి. ఆమే నేనూ అప్పాతమ్ముల వరసతో మెలిగే వాళ్ళం—నే నంటే ఎంతో ఛెడ్డదయ ఆమెగారికి-"

"మీ రిక్కడేం జేస్తుంటారు?"

"ఇంటిరివాజు జోస్య మొక టుందిగదాండి? కా స్త వాస్తూ గట్రా కృషిచేశాను. దానా దీనా మీదయవల్లను ఇంతవఱకూ"—అటు నిటుజూచి—"మర్యాదగానే బండి లాక్కొస్తున్నాను- ఏమిటో వయసులో పెద్దవాణ్ణి, ముఖ్యంగా మీ కాశ్రితుణ్ణి- కొంచెం చనువుగా మాట్లాడుతుంటాను— క్షమించాలి."

"దాని కేమిటిలెండి!"

"మా కింతలో చీరా ధోవతులచాపులు కట్టపెట్టారా? ఆలాంటి ప్రయత్న మేదన్నా జరుగుతూ వుందా? మీ రింకా ఈలావుండటం నాకెంతో కష్టంగావుంది. నాన్నగా రుంటే ఇంకా ఈలాగే ఉంచుదురా మిమ్మల్ని! వా రుంటే మీ రింత గొప్పవిద్యావంతులైనందుకు ఛెడ్డఉత్సాహపడీవారు! ప్రాప్తం! ఏఁ—పలకరేఁ!"—అని మెల్లప్రక్కజూచినాఁడు.

"ఔతుంది ఎప్పుడో!"

"ఆలా అంటే సరిటండీ! చిన్నప్రాయంలో పెండ్లి పేరంటమూ అచ్చటా ముచ్చటా సబోరిగా జరిగితేనే దాని పసందు! మీరు 'ఊఁ' అనండి-నాకు బెత్తాయించండి- మూణ్ణె మిషాల్లో రహితం చేసేసేస్తాను"- ఇరుకెలంకుల గాంచి-"మీ రొక్క కొడీ ఖర్చుపెట్ట నక్కర్లేదు. దర్జాకు తగ్గకుండా లోసుగుండకండా సాబీగా సజావుగా ఫయిసలా చేసేసేస్తాను.

చూడండి నామాటన్నాను. ఈ మాత్రం మీకు చెయ్యక పోతే ఇహ ఈజన్మ ఫ్రుండీ ప్రయోజన మేమిటి..."—అని మెట్లవంకఁబరికించుచు— మ ఱేదానినో చెప్పఁబోవుచుండి నాఁడు శాస్త్రి-

"రాముఁడూ—"—అని క్రిందనుండి పిలుపు. రామచంద్రుఁడు దబదబ వచ్చి మెట్లద్వారమువద్ద నిలిచి తొంగి చూచి-

"నువ్వా! సోమసుందరం, రా"—అని యాహ్వానించి నాఁడు. సోమసుందరము మేడమీఁదికి వెళ్లఁగనే, శాస్త్రి తత్తరమున లేచి—

"సెలవుపుచ్చుకొని తరువాత దర్శనం చేస్తాను" అన్నాఁడు.

"చిత్తం"—అన్నాఁడు రామచంద్రుఁడు. శాస్త్రి వెళ్లి నాఁడు— సోమసుందరము పడకకుర్చీమీఁదఁ గూర్చుండుచు, కనుబొమ్మలు ముడివెట్టి, కండ్లు చికిలించి, ముక్కు—చిట్లించి, మూతిబిగించి, శాస్త్రివైపు తలయూచి—'ఎవ రితఁ'డనియో! 'ఎందుసకు వచ్చె' ననియో భావము వెలువడునట్లు సాభినయముగఁ బ్రశ్నించినాఁడు సోమసుందరము. నిక్కి—చూచి శాస్త్రి పూర్తిగ దిగిపోయినాఁడని యెఱిగి.—

"మానాన్నగారి సెటుఁగు నఁట! చూట్టానికి వచ్చానన్నాఁడు"—అని రామచంద్రుని ఉత్తరము.

"అప్పుడే ఘుమాయిస్తూందిరా! వేసవికి అంకురార్పణం కామోసు!—" అని కండువా చెఱంగుతో విసరుకొనుచు—

"కోర్టునుంచి ఇప్పుడే వచ్చి కాఫీపుచ్చుకొని ఈలా వెళ్ళొయొచ్చాను. ఏదీ నువ్వీమధ్యవ్రాసిన వేమిటో వినిపిస్తావనా?"-అన్నాఁడు సోమసుందరము.

"అదే మఱొకమాఱు చూసుకుంటున్నాను"

"చదవోయ్ ఆనక సవరిస్తూగాని"

"నువ్వు ఊరికే వింటేగాదు. నీయిష్ట మొచ్చినట్టు విమర్శించు—అలా విమర్శిస్తే వట్నాయనా నేను నిజముగా సంతోషిస్తాను."

"నీ సంగతి సరే నే నెఱిగిందేగా! చెబితే నమ్ముతావో లేదో; సాధారణంగా ఎవళ్లేనా ఏదేనా వ్రాసి పట్టుకొస్తారు వినిపించడానికి. నీ వన్నట్టే చగ్గా విమర్శించమంటారు. విమర్శించామా వాళ్ళ కొఱకొఱ కొరలు. మనదా ఊరికే బుఱ్ఱ వూపే మచ్చుకాదు. ఏదేనా తోచిందా చీదాగా బద్దలేశి చెప్పవలసిందే! విన్నాడా సరే!— లేదా—వాడికర్మం. సరే కానీ ఆ గొడవెందుకు?" అన్నాఁడు సోమసుందరము-

రామచంద్రుఁడు సులోచనాలు సవరించుకొని బుజముమీఁది తువాలు సరదుకొని—

"ఇది బి.ఎల్ ఎక్సామినేషన్ హాల్లో వ్రాసింది. మొన్న బట్టలు సరుదుతూవుంటే కోటుజేబులో కనబడ్డది. అంతవఱకూ దాని ఫికరేలేదు?

"ఈలాగే నేను వ్రాసినవి కొన్ని అంతరించాయి"

"'గేయం—" అని హిందూస్థానీ కాఫీరాగముగూర్చి పాడఁదొడఁగినాఁడు రామచంద్రుఁడు-

గేయము.

"చెలువు గని తొలివలపు గొంటినో!
వలచి చెలువము కలిమి గంటినో
చెలువు వలపుల చెలిమి నేమో
తలఁపు దలఁపునఁ బులకరింతలు—
పలుకరా దమ్మా నావలపుతలఁపు!

*　　*　　*　　*

తలఁపులేని పలుకు వెలయదు;
పలుకులేని తలఁపు దెలియదు;
తలఁపు బలుకులు దారసిల్లిన
తొలకరించును పులకరింతలు—
పలుక వే మమ్మా నీ వలపుసొలపు!"

సోమసుందరము చాలకుతూహలముతో మూఁడు నాలుగు మార్లు చదివించుకొని విన్నాఁడు—

"మాంచి సాఫ్గా తీరింది. భావానికి తగ్గట్టు పదజాలం గూడా బహుసుకుమారంగా పడ్డది. ఈరోజుల్లో చెప్పేకవిత్వాల్లో చాలాభాగం బుఱ్ఱబద్దలుకొట్టుకున్నా బోధపట్టం లేదు— వట్టిగుల్ల. శబ్దపరిథవంలావు. ఏమిటాంటే—

'మిస్టిక్ పొయట్రీ' (mystic Poetry ) అంటూ దబాయిస్తారు. భావ మనే దేదేనా వుంటే గింటే భాషలో పూడ్చిపెడతారు. అసలు విషయాన్ని భావించి వ్రాస్తే బోధపడేది. వ్రాసిన వాడికే అబోధమైతే చదివేవాడి కేం బోధపడుతుంది! అంటే అభావంలోంచి భావంపుట్టిస్తున్నా మనుకుంటున్నారు. భావ్యా భావ్యా లున్నాయని ఊహించరుగదా! నేనూ అలాంటివి చదివాను కొన్ని. అర్ధరాత్రి అమావాస్య చీకట్లో అరణ్యంలో దారి కనబడక తన్నుకున్నట్టుండింది.

"నీవు వ్రాసింది మాంచి ఫోక్తాయింపుగా పడ్డాదిరా పోత. అసలు ఎత్తుగడ సజీవంగా వున్నాది. సరీగా సమయానికి అతికినట్టుంది. నిజమైనభావసంచలనం గలిగినప్పుడు పుట్టే మాటలఊటలే కవిత్వ మన్నారు రసజ్ఞులు. వాటినే ఛందో బద్ధంచేసీ చికిలీపట్టి లోకానికి చూపెడుతుంటారు. ఎంతమంచి జాతిరత్నమైనా సానపట్టకపోతే అలంకారయోగ్యంకాదు. అబ్బాయ్, ఏమో అనుకుంటున్నావ్! సరసమైనపాకం స్వాధీన మయింది. కృషి వదలకు సుమీ!"

రామచంద్రుఁడు సస్మితముగాఁ బ్రక్కకుఁజూచినాడు. సోమసుందరము-

"సరే అ దల్లాఉంచు—ఎప్పు డేర్పాటు చేశారు?"

"దశి మఁట!"

"ఎవళ్ళకేనా ఫ్రెండ్సుకి వ్రాశావా?"

రామచంద్రుఁడు సిగ్గుతో లే దని తలయూచినాఁడు.

"వట్టి అడివిమనిషిలాగున్నావు- సిగ్గేమిట్రా! నేద్రావా శే శేస్తాలే. ఇంకా దశమి నాలుగు రోజులున్నదిగా!— ఇక్కడే కాదూ?"

"మరే"

"మీాబావ వట్టి పిటికి-డచ్చిలాంియుడు. కాని మనసు మహామంచిది, చెడ్డపట్టుదల. అనుకున్నాడాంటె చే శేశా డన్నమాటే. ఇంతకూ మీాచెల్లెలు నెమ్మదైందీ-ఆలోచన గలదీని; ఎవళ్ళనీ ఖాతర్ చేశేరకంకాదు.-"

"దానిపట్టే ఇ దంతాను."

"సీ నిలకడకంటే మీాచెల్లెలి ధైర్యాన్ని మెచ్చాను- ఆడాళ్ళలో ఆవేశం బయల్దేటి టానికి అవకాశం లేకుగాసీ బయల్దేటిందా బ్రహ్మతరంగాదు ఆపటానికి. సరే వెళదాం రావూ బీచిసైడుకి?"

రామచంద్రుఁడు గదిలోనికివెళ్ళి డ్రెస్సు వేసికొని వచ్చి నాఁడు. ఇరువురు బయలుదేటినారు. సోమసుందరము గుమ్మము దాఁటినాఁడు. రామచంద్రుఁడు గడపదాఁటుచు తిరిగి చూచినాఁడు. నడిమింటిలో నిలుచుండి రంగ నాయిక కృష్ణకు జడవేయుచున్నది. కృష్ణా-రామచంద్రుల దృగంచలములయందు దొక్కమాఱు తటిల్లతవలె అనూన సాత్త్వికభావము మెఱసినది.

---

## ౧౧. ప్ర క ర ణ ము .

ఎనిమిదిగంటలు కావచ్చినది. సందెవెన్నెల మకమక లాడుచున్నది. రామచంద్రుఁడు వేగముగా ఇల్లుచేరి . మేడ మీఁదికి వెళ్ళినాఁడు. గోడదీపము కడకేఁగి చేతనున్న కాగితమువిచ్చి చూచుకొని బల్లమీఁద వేసినాఁడు. చూపు ఊర్ధ్వగతి జెందినది; నిట్టూర్పువుచ్చినాఁడు. రెండుచేతులఁ దల నొక్కికొన్నాఁడు. అధోభాగమునకుఁ జూపు గదించి నిలబడినాఁడు. వెలుపలివసారాబయలులోనికి వెళ్ళి నడుమునకుఁ జేతులు మూ ఱొడ్డి పచారుచేసినాఁడు. మధ్యమధ్య స్తంభించి పోవుచున్నాఁడు. ఆకసమునఁ జూపు నిలిపినాఁడు. గదిలోనికి వెళ్ళి అరవిచ్చిన చొక్కాయితో నట్టె నిలువఁబడి గోడ మీఁద చూపు గుఱిపెట్టినాఁడు. తల విదిర్చినాఁడు. ఒడలు కంపించినవి. బల్లమీఁదికాగిత మందుకొని నిబ్బరముగఁ జదివికొన్నాఁడు. కోపదృష్టులం బఱపినాఁడు. అశ్రుకణములు రాల్చినాఁడు.

"అన్నయ్యా, భోజనానికి రావూ?"— అని క్రిందినుండి రంగనాయిక పిలిచినది. రామచంద్రుఁడు స్వప్నావస్థనుండి మేల్కొన్నాఁడు. ధ్వని ఎవ్వరి దని ఆలోచించి-ఊహించినాఁడు. పిలుపా అని తర్కించినాఁడు. పిలుపునందలి అక్షరములను మనసు అందికొనలేదు.

"ఆఁ"—అని మాత్రము కలవరింతవలె నన్నాఁడు. రెండు నిమిషములైనవి.

"భోజనానికి రావట్రా అంటే—'ఆఁ'-అని ఊరకున్నా వేమిటే?"—అనుచు రంగనాయిక మేడమీఁదికి వచ్చినది. అర విచ్చినచొక్కా-యితో చేతఁ గాకితముతో పరాకున నిలుచున్న రామచంద్రునిఁ జూచి——

"కవిత్వప్పిచ్చ పడితే ఇహ నేమీ తోచదు. ఎందులో పడ్డా అదేలోకం నీకు; తిరిగీ ఏదన్నా వ్రాశావా?"— అన్నది. జవాబులేదు. రామచంద్రుఁడు కోటుపూర్తిగా విడిచి మంచముమీఁదికి విసరుచు—"నాకాఁకలి వేయటంలేదు"—అని పెడమొగము పెట్టి వెక్కసముగఁ బలికినాఁడు.

"ఏమిటే ఏదో మోస్తరుగా ఉన్నావు?-" అన్నది రంగనాయిక.

"ఏమిటీ లేదు"—అని ఉదాసీనతతో ఉత్తరము.

"అఘోరించావు- లే- దిగినమాత్రం రెండుమెతుకులు తిని వస్తూగాని."

"బలవంత మేమిటమ్మా అవసరంలే దంటూ ఉంటేను."

"అల్లాగాదు—రావాలి. ఈపూట కృష్ణపాకం రుచి చూతూగాని రా...ఎంతబాగా చేస్తుందిరా?—ఎప్పుడు నేర్చుకున్నదో కాసీ!"

"అఖర్లే దంటే! చెబితే విను."

"ఏమిటో ఆందోళన పడుతున్నావు"— అని దగ్గఱకు వచ్చి కూర్చుండి బ్రతిమాలినది.

"ఏమిటో ఆయాసంగా ఉందే"- అని రామచంద్రుడు మంచముమీఁద పరుండి పైచాందినీ వైపు చూచుచున్నాఁడు.

"ఏమి టాయాసం?"—అన్నది రంగనాయిక.

పలుకఁడు-చలింపడు. రంగనాయిక ఒట్లుపెట్టుకొన్నది. రామచంద్రుఁడు లేచి కూర్చుండి ఊర్చి దోసిటిలో ముఖ ముంచుకున్నాఁడు.

"అన్నయ్యా, నాకు ఎన్నఁడూ దాపరికం పెట్టేవాఁడవు గావుగదా! ఏమిటో నీవు పడేబాధ చెప్ప వేమిటి! అమ్మ ఏమన్నా అంటుందనా?"— అని పలువిధముల గడ్డము పట్టి చనువుమై నడుగుకొన్నది రంగనాయిక.

"పలక వేమిట్రా! మనసులో పెట్టుకొని కుళ్ళటం బాగాలేదు. నాకు చెప్పటానికేఁ!"

డక్కుత్తుకను సవరించుకొనుచు ఖేదముతో— "ఏమిటి చెప్పమంటావ్! దాన్ని వాళ్ళ అన్నయ్యవద్దికి పంపి వేయ్. నా కిష్టంలేదు."—

అనిన రామచంద్రునిమాట రంగనాయికకు చలి పిడుగు పాటైనది- మతిపోయినది. చిత్రితప్రతిమ యైనది. కొంతవడికిఁ దెప్పిఱిలి——

"ఏమిటో సంగ తన్నా చెప్పు. అల్లాగే పంపివేతా మ్లే-" అన్నది.

రామచంద్రుఁడు షర్టుజేబులోనుండి కాకితము తీసి ఇచ్చినాఁడు. రంగనాయిక తడవుసేయక దీపముకడఁ జేరి చూచుకొని—

"ఇది స్పష్టంగా కిట్టని దొంగముండ కొడుకులు చేసిన కుట్ర- సందేహంలేదు. ఇవి దాని అక్షరాలే కావు; పోనీ ఎవరితోనన్నా వ్రాయించి దనటానికి వ్రాసేవా రేరీ మన యింటోను-? ఈ మాత్రానికే నట్రా! అది అగ్నిహోత్రమే! ఒరే నా కొక్క-మాటకి సమాధానం జెప్పూ- అల్లాంటి వృత్తి ఉంటే ఆ మహారణ్యాల్లోబడి అసురుసురై ఇక్క-డికి రావడ మెందుకు? చిన్నప్పట్నుంచి దాని స్వభావం ఎఱుఁగుదుం గదా! తొందరపడ్డావు. శాంతం తెచ్చుకో! నిమ్మళంగా ఆలోచించుకో! వట్టినె ఖంగారు మనిషివి! దా న్ననుకున్నా వాళ్ళు తుడిచిపెట్టుకు పోతారు; చూడు నామాటన్నాను! అల్లా ఏ మాత్రం సందేహంగాఉన్నా నామట్టుకి నే నొప్పు కుంటానా? మభ్యపెట్టి ద్రోహాని కొడికడతా ననుకున్నావా? మనస్సు కుదట ఉంచుకొని ఆలోచించు!- ఈ జాబు నీ కిచ్చిన వాఁ డెవడ్రా!"— అనుచుండగనే రామచంద్రుఁడు లేచి తువాలు వేసికొని రంగనాయిక చేతికాకితము లాగికొని మెట్ల గుమ్మము వద్దికి బిస బిస నడచినాఁడు. సోపానమార్గమధ్య

మున నిలుచుండి యుండిన కృష్ణ వడివడిగ దిగి వెళ్ళినది. రంగ నాయిక రామచంద్రుని వెన్నంటి దిగుచు—

"ఎక్కడి కా వెళ్ళటమ్?" అన్నది.

" ఇప్పుడే వస్తాను"— అనుచు దిగి తిరిగి చూడక వెళ్ళి నాఁడు—

... ... ...

సోమసుందరము అప్పుడే భోజనముచేసి చేయి తుడుచుకొని 'బేవ్' మని త్రేచుచు ఆఫీసుగదిలోనికి వచ్చుచున్నాఁడు. బయటినుండి తలుపు సఱచుచు "సోమసుందరమ్,"- అని పిలిచినాఁడు రామచంద్రుఁడు.

"ఎవరూ?"- అని తలుపు తెఱచి—

"నీ వటోయ్!"-అని చిఱునవ్వున- "మరల ఏదేనా స్ఫురించిందా? నీ ధ్వని ఏదోమో స్తరుగా ఉండింది చప్పున పోల్చలేక పోయ్యాను." అన్నాఁడు సోమసుందరము.

ఇరువురు చెరియొక కుర్చీమీఁదఁ గూర్చున్నారు. రామచంద్రుఁడు మౌనముగా కాకితము సోమసుందరమున కందించుచు—

"ఏవిషయమన్నా జవాబుదారీ గుర్తించి బాగా ఆలోచించి చెప్పేవాడి వని నా నమ్మకమ్. నీసలహా కొచ్చాను"— అన్నాఁడు.

సోమసుందరం నెమ్మదిగా చదువుకొని పక్కన నవ్వి- 'ఎవఁ డీ జాబిచ్చిన తుంటరి? ఆనెక మనం మాట్లాడుకుందాంగాని నావెంట రా''-అని రామచంద్రునిఁ గొని చనెను.

... ... ...

నాలుగైదు మలుపుసందులలోఁ జొరబడి ఫర్లాంగు వఱకు నడచి ఒక ఇంటివద్ద ఆగిరి. సోమసుందరము తలుపు తట్టుచు—

"కృష్ణమూర్తిగారూ''- అని కేకవేసెను.

"అయ్యా, వచ్చె-''- అని లోపలినుండి కృష్ణమూర్తి చేతిలాంతరుతో వచ్చి తలుపు దీసి చూచి-

''ఏమిటీ పంతులవారు ఈలా దయచేశారు !- వీ రెవరు?''

"మన స్నేహితులే లెండి కొంచెం మీతో మాట్లాడ పని ఉండి వచ్చాను. వస్తారా ఆలా సముద్రంకేసి వెళ్దామ్!"

"చిత్తమ్''- అని కృష్ణమూర్తి వెడలినాఁడు. ముగ్గురును సముద్రముఒడ్డు ఱాతికట్టకడకు వెళ్ళి నిలిచినారు.

అంతట సోమసుందరమునకును కృష్ణమూర్తికిని ఇట్లు మాటలు జరిగినవి:

"మీరు సారంగధరనాటకం వేస్తా ఎప్పుడు?''

"మొన్నను... ఆదివారం.''

"సారంగధరపాత్ర మీరే వేశారు.''

"చిత్తమ్.''

"కృష్ణమూర్తిగారూ, చూడండి, మీరు, నాటకాల్లో తిరిగే సజ్జులాటివారుగా దనిన్నీ, గౌరవంకోసం పాటుపడే వా రనిన్నీ విని వచ్చాను. మిమ్మల్ని ఒక్క ముక్క అడుగు తాను. ఉన్న దున్నట్టు చెప్పేశేసెయ్యండి. మీకు వచ్చిన భయంగానీ, నామూషీగాని మరేమీుండదు."

"దానికేం బాబూ సెలవియ్యండి. నాస్వభావం తమకు బాగా..."

"ఆకళింపు ఉండబట్టే నిజం తెలుస్తుం దని వచ్చాను. చూడండీ!— నాటకమైన మఱుదినం మీ కెవరైనా స్త్రీ పదైనా ఉత్తరం గిత్తరం పంపిందా? దాన్ని మీ రెవరికేనా మీ స్నేహితుల్లోవాళ్ళకి ఇచ్చారా? అలా వచ్చి ఉంటే ఆవిడ పేరు చెప్పటానికి మీ కాక్షేపణలేకుంటే చెప్పొచ్చు. దాన్ని గుఱించి మే మంతగా తఱచదలంచుకో లేదు కూడాను."

"ఉత్తర మేమిటి! స్త్రీ వ్రాయట మేమిటి! సోమవారం మధ్యాన్నం వెళ్ళాను నరిసీపట్నం. ఆ వేపున పొలాలు గట్రా చూచుకొని [1]ఉష్ణంతో చేరాను ఈ వేళ సాయంకాలానికి—కొంప. మీ రడుగుతూన్నంటే నిర్ఘాంతపోయ్యా నన్నమాట. ఈశ్వరసాక్షిగా నే నేమి ఎఱగను బాబయ్యా."

---

1. = జ్వరము.

"మీరు సంకోచించ నక్ఖర్లేదు:- చూడండి.!- పురుషుడికి తప్పా? మన మేమిటి శుకమహాఋషులమా! ఋష్యశృంగులమా! ప్రవరాఖ్యులమా!"

"నిజమే తాము సెలవిచ్చింది. నే నేమీ మడిగట్టుకున్నానని చెప్పటంలేదు. చేశాను నేనూ తప్పులు. ఇప్పుడు ప స్తా యి స్తు న్నా ను కూ డా ను . కాని ఈ సంగతే మీటో ఎఱుగ నని మనవి చేస్తున్నాను.

మనఊరిమోాస్తరు మీా రెరక్కుండా ఉన్నారా బాబూ! వట్టినే ఒకటికి నందకల్పించి కొంపలు తగలెట్టేస్తుంటారు. ఎఱుఁగరూ తామూ- ఆగుంట వెధవ, గోపాల్రావుగాఁడు, జగన్నాథంపంతులుగారి భార్యాకోసం తంటాలుపడటం, ఆమెగారు చీవాట్లెట్టటం, ఆకావేషీమిాద వాఁ డర్ధరాత్రి తలుపు తట్టటం, ప్లీడరుగారు వాణ్ణి పట్టుకొని నాలుగు ఖర్చుకియ్యటం,-'నీభార్య రమ్మనమన్నదని ఆవెధవాయ వాగటం- ఊరంతా షోరెత్తిపోలే దండీ? ఆమె అనసూయా అరుంధతీ లాంటి మహాయిల్లా లని చెప్పుకుంటూరు; ఏమిహైతేనేం- అనుమానం కలిగింది భర్తకి; చివరకి ఆసంసారం పగిలిపోయింది. ఈలాగంటి [1]కులికిద్రాలవల్లను పండువంటి కాపురాలు వట్టినే కూలిపోతుంటాయి బాబయ్యా- తమ రెఱుగరా ఏమిటీ?"

---

1. కులికిద్రిం-కుతంత్ర మని భావింపవచ్చును.

"సరే అదంతా ఎఱుఁగుదుంగా! మఱి ప్రస్తుతవిష యాన్ని గుఱించి యే మంటారు?"

"ఏమన మంటారు?— మీరు కోరినప్రమాణం చేస్తాను."

"చూడండీ— సూరి సత్యనారాయణ శాస్త్రిట! ఆ జోస్యం గట్రా చెబుతుంటాడట!— అతన్తో మీ కేమిటి పరిచయం?

"ఆఁ—ఇప్పు డర్థమైంది. జోస్యంలేదూ వాడి శ్రాద్ధమూ లేదు— వాణ్ణెరుగుదు—నాకు వాడితో పరిచయం గిరిచయం ఏమీ లేదు— అభూతకల్పన్లకి అంతవాఁడు లేఁడు— వట్టి డాఫరు ముండకొడకు— డచ్చీఖోరు— దగాఖోరు. అస్తమానం ప్లీడర్ల ఇళ్ళచుట్టూ తిరగటం వాడిపని. చెయ్యండి వాకబు వాడిపురాణం తమకే బోధౌతుంది."

"చూడండీ!— ఉమామహేశ్వరంగా రఁట!— ఆయనకీ ఈయనకీ ఏమిటి స్నేహం?"

"అసలు ఉమామహేశ్వరంగార్నెఱుఁగుదురా! పించను పుచ్చుకొన్నారు. ఎక్కడో దివాను గట్రా చేశా రటకూడాను! డెబ్బైయేళ్లుకావచ్చాయి - ఇంకా ఆయనగారికి తిరుగుమోత్తనం మాన్లేదు— ఇంకా మీసాలకీ, బుర్రకీ, కనుబొమ్మలకీ కూడా రంగుపులుముకుంటుంటాఁడు. ఈమధ్యనే పళ్లూకూడా కట్టించుకొన్నాఁడు. డబ్బంటే గోటూపన సరేసరి. చీవాట్లూ

చీపురుదెబ్బలూ ఆయనగారికి నిత్యవిధి. ఆలాంటివారికి తారుస్తూ తలలు మాఋుస్తుంటాడు ఈ సత్యనారాయణ శాస్త్రి—విచారించండి."

"సరే ఉండిపోండి. ఉష్ణంగాకూడావుం దన్నారా— చాలాశ్రమపెట్టాను.-క్షమించండి."

"ఫర్వాలేదులెండి. మీరు ముఖాముఖీ సత్యం కను క్కోవటానికి వచ్చారు. సబోరీగా వ్యవహారం తేలిపోయింది. నాకు చాలాసంతోషంగా ఉంది."

అని అటనుండి తఱలినారు. కొంతదూరమువచ్చి కృష్ణ మూర్తి తన ఇంటికివెళ్ళినాఁడు. సోమసుందరము రామచం ద్రునితో నడచుచు—

"విన్నా వటోయ్ అసలునిజ మేమిటో తేలిందిగా? ఏమిటీలేదు. మనప్రయత్నం చెడగొట్టేనేకాని ఆ ఉమామహే శ్వరంగారి కూతుర్ని నీకు కుదర్చటానికి వీల్లేదు. అంచేత వేశారీ పన్నాగం— తెలిసిందా?

నువ్వొకాస్త లౌక్యం నేర్చుకోవాలి. ఇహను జరిగిన విషయాన్నంతా ఒకమాటు [1] తైఫారువేసి చూచుకో. వెళ్ళు, మరోహామో స్తను తలపెట్టకు.—" అన్నాఁడు.

"తెలిసిందిగా! ఉదయం కనబడతాను—" అని రామచంద్రుఁడు వీడ్కొన్నాఁడు.

---

1. విలియా (comparison)

## ప్రకరణము - ౧౨.

అరుణోదయమైనది దొడ్డి వసారాలో కుంపటిమీద కాఫీకి నీళ్ళు పెట్టి విసరుచు—

భక్తితో తులసికీ గోవిందా రామ-
పాదు నే చేతునూ గోవిందా రామ.
కృష్ణతులిసెమ్మకూ గోవిందా రామ
మ్రొక్కులం దిత్తునూ గోవిందా రామ—"

అని వంటలక్క అవధానుల రామమ్మ పాడుచున్నది. బాదముచెట్టుక్రింద పనికత్తె పాత్రలు తోముచున్నది.

"నిత్యోదకములనూ గోవిందారామ-

ఏమిటేవ్ మే మేమిటి బ్రామ్మల మనుకున్నావా శూద్రాళ్ళ మనుకున్నావా?— యావన్నాగాని— అయ్యో దేముడ! ఎన్నిసార్లు చెప్పనే?—ఆ బోకుల్లో అంట్లు ఆపాళం గానే శడతావ్ యావన్నాగాని రోజూ ఆ అంట్లన్నీ కడుక్కొని పూటపూటా స్తానాలు చేస్తుంటాను- చెప్పినా తెలవకపోతే ఏలాగ?—

'నిత్యోదకములనూ గోవిందా రామ—

అబ్బే అదేమిటేవ్—నీ చుట్టముక్క తగలెయ్యా—అంతా మాలకూడే అయింది యావన్నాగాని— ఎంగిలిచుట్టముక్క

ముట్టుకున్న చేత్తోనే ఆకడిగిపెట్టిన పాత్తర్లు ముట్టుకుంటున్నావుటె-యాావన్నాగాని- అయ్యో ఆచార మగ్గిపడ్డట్టే ఉన్నాది-

"నిత్యోదకములనూ గోవిందా రామ—

బయట పేణ్ణీళ్లెట్టావుటే? వెళ్లు ముందుగా ఆపనిజూడు! ఇల్లూ తుడిచావుగావుగదా! పాచికొంపంతా ఆపాళంగా ఒగ్గేసి—యాావన్నాగాని— అంట్లకొచ్చిందిటే నీకు తొందర?—"

"అమ్మగోరింకా తొంగుంటే ఏలా తుడ మంటారు?"

"భాగీరథీగంగ గోవిందా రామ—

చూడూ, అమ్మో, ఆవు దగ్గర పేడాకసువు దీసి ఆ దూడని ఇసుంట దూరంగా కట్టెయ్యి— చిక్కడు తీగలుమేస్తున్నాది....—"

అని, తులసెమ్మపాటతో దాసిదానికి చీవాట్లు జోడించి విసరుచున్నది—వంటలక్క.

రంగనాయిక ఎందునకో మేడమీఁదికి వెళ్లినది.

"ఎక్కడ జాటిపోయిందో!"— అని అస్పష్టముగా నను చున్నాఁడు రామచంద్రుఁడు.

రంగనాయిక మంచముం దరిసి—

"అనయ్యా, కలవరిస్తున్నావట్రా ?- లే !- ప్రొద్దు పొడుస్తున్నది."

"..............."

"లేరా" అని తట్టి లేపినది.

రామచంద్రుఁడు కనులు తెఱచినాఁడు.

"కలవరించావా ?"

కలవరించానటే?- ఏమని?- కలలో ఉండగానే లేపే శేశావ్."- అన్నాఁడు రామచంద్రుఁడు.

"కవీశ్వర్లకి కలలకేం తక్కువ?- మేలుకున్నా కలలే నిద్దర్లోనూ కలలే. నాకేమిటో ఒక్కకలా జ్ఞాపకముండదు. కొందఱే కలలు కథల్లాచెబుతుంటారు."

"కథలే కలలౌతుంటాయి; కలలే కథలౌతుంటాయి."

"పోనీలేద్దూ మాట మాట్టాడితే కవిత్వమేనా ?- ఏమిటా కల ?"

"మొన్నను తెచ్చాను గోల్డుచెయిన్ రిస్టువాచీ !- అది ఎక్కడికో వెళ్ళివస్తుంటే జాఱిపడ్డట్టూ దాన్ని వెదకుతూ ఉన్నట్టూ"—

"దొరికిందా ఇంతకూను ?"

"వెదకడంలో ఉండగానే లేవగొట్టావుగా!"

"ఔను గానీ- కలలు కొన్ని జరుగుత వంటారు- నిజమే నంటావా? అమ్మకి కలలు జరుగుత వనే నమ్మకమ్."

"ఆరోగ్యవంతుడికీ శాంతుఁడికీ కలలురానే రా వనీ ఎప్పు డన్నా అదాటుగా వస్తే దానిఫలితం కనబడుతుం దనీ,

అంటారు. పరున్నదిమొదలు నిద్రంతా కలలతోనే గడిపే వాళ్ళకి ఎన్నికల లొస్తేనేం?"

"లే ఇంకా పరున్నావేం?- రాత్రి సోమసుందరం యామన్నాఁడు? నే నన్నంత నిజమైందా?"

"ఈ వాళ ఆ సత్యనారాయణశాస్త్రి రానీ చెబుతాను."

"ఇల్లా ఎన్నికొంప ల్దీశాడో వీడిదుంపదెగా!"

"ఎంతో పెద్దమనిషిలా కనబడ్డాడే వీడి బొడ్డుపొక్కా!

"దొంగ తొత్తుకొడుకు లందరూ ఆలాగా కనబడుతుంటారు.- లే వెళదామ్ క్రిందికి."

ఇరువురు క్రిందికి దిగివచ్చినారు. కల్యములైనవి.

"భాగీరథీగంగ గోవిందా రామ—

అని పాడుచుండిన వంటలక్క రామచంద్రునిఁ గాంచి పాట ఆపి సిగ్గు నటించి——

"పూర్వకాలపప్పాట లనికామోసు అబ్బాయిగారు నవ్వుతున్నారు.- ఏమండోయ్ రంగనాయకమ్మగారూ, రోజూ ఇడ్డెన్లేనా అని కోప్పడతా రని ఈవాళ పెసరట్టు వేస్తున్నాను..."అన్నది.

"మంచిపంజేశారు. అన్నయకి చెన్నాపట్నంలో పెసరట్టు దొరకదు. మొగంవాచి వచ్చుంటాఁడు.—" అన్నది

రంగనాయిక రామచంద్రుని మొగముజూచి నవ్వుచు. దిరుకులం బరికించుచు రెండు పెసరట్లు తిని, రంగనాయిక చల్లార్చి ఇచ్చిన కాఫీ పుచ్చుకొని లేచి తలవంచుకొని ఓరచూపులతో ముంగురులం దడవికొనుచు దిన్నఁగా మేడమీఁదికి వెళ్ళినాఁడు రామచంద్రుఁడు.

"ఇదేమిటమ్మా ఈవిడ నిద్దర్లేవనేలేదా!— ఇంతసేపు పరుండేదికాదే!"— అనుచు రంగనాయిక లేచి గదిలోనికిఁ బోయి మడతమంచము మీఁద ఎఱ్ఱబుర్నీసు కప్పుకొని పరున్న కృష్ణను చలిచినది. మనిషికాదు- చూడఁగా తలగడనిలువున నున్నది. వేళాకోళానికి ఎక్కడనోదాఁగి ఇట్లు ఉడికించుచున్న దని రోషముతో ఇంటిలో నాలుగు మూలలు వెదకినది—కానఁబడదు. బీర్వామాటున?—లేదు. ఉగ్రాణపుగదిలో?— ఊహూఁ. దక్షిణపువైపువసారాదొడ్డిలోని జాజిపొద చాటున?- అగపడదు. ఎక్కడికిఁ బోయిన దని ఆలోచన. ఎన్నఁడు బయటిగుమ్మము మొగము చూడదే యని సమాధానము. క్రొత్తయూరు-పరిచితులులేరు- మ ఱెక్కడి కేఁగునని ప్రశ్న. ఉత్తరము తోఁపదు. పూర్వాపరసందర్భములు ముఖాబిలాకు వచ్చినవి. రాత్రి తాను, రామచంద్రుఁడును మాటలాడు నపుడు వినియుండునా యని సంశయము- ఉండు నేమో యని శంక. రాత్రి మేడదిగివచ్చినది మొదలు తనతో యథాపూర్వముగ అరమఱికలులేక మాటాడెనా యని సందేహము-

జ్ఞప్తి లేదు. లోనియురియాట రేగి ఓర్పును తూలఁగొట్టుచున్నది. వంటలక్క నడిగినది. ఉదయమునుండి చూడలే దని ఆమె జవాబు. వెదకవలయుస్థలములు?— ఏవియో ఊహ కందవు. మఱి దానిసామాను?— ఐరన్ సేఫ్ ప్రక్కన పెట్టినది పెట్టిన ట్లున్నది ట్రంకు. తాళముచెవి దానికే యున్నది. పెట్టెపైఁ బుస్తక మొకటియున్నది-అది యామె చదువు చుండిన శాకుంతల నాటకము. నిన్న ఆమెకట్టినది సిల్కుచీరయేగదా?- ఔను అది దండెము మీఁదనే యున్నది. జాకెట్టు?— అదియు దానిప్రక్కనే వ్రేలుచున్నది. పెట్టెలోని వస్తువులు?—అన్నియు మట్టసముగనే యున్నవి. ఒక్కొక్కటిగాఁ దీసినది. ఆమె కాలనున్న పట్టెగొలుసు కనఁబడినది. దుద్దులు, చేతిగాజులు, గడి యారముగొలుసు— డబ్బిలో నున్నవి. బయటనుండిన ఆమె చీరలు అవికెలు?— అన్నియు నెక్కడి వక్కడ నున్నవి. రంగనాయికగుండె లవిసినవి. దుఃఖావేశము ఉబ్బూతలూచి నది. ముందువెనుకలు తోఁపవు. కంఠమునుండి ధ్వని వెలు వడదు. నట్టేటి మునకలైనది. కాళ్లాడవు. కంపించుచున్నది కాయము. ఈకళవళపాటున శరీరము నెట్లో మేడమీఁదికిఁ జేర్చినది. అచట రామచంద్రుఁడు ఎడమవ్రేళ్ళతో మీస ములను స్పృశించుచు పద్యములఁ దిద్దికొనుచున్నాఁడు.

"రాముఁడూ,"— అని కన్నీరువదలినది రంగనాయిక.

"ఏమిటే అమ్మాయ్!"—అని సమీపించినాఁడు రామచంద్రుఁడు. రాల్పడిన యెలుఁగుతో: "కృష్ణ కనఁబడదురా!" అను నక్షరములను బలవంతముగ బయటవేసినది రంగనాయిక. రామచంద్రుఁడు వెఱ్ఱిచూపులఁజూచుచు నిలుచున్నాఁడు. ఆ నిర్విణ్ణతనుండి ఆ నిశ్శబ్దతనుండి యుద్గమించుచున్న భావవీచికల వినిపింపఁగల వక్తయేఁడీ? ఆ యన్నసెల్లెండ్ర అశ్రుసంప్లావితలోచనములు గురియుచున్నరసము నెత్తిచూపఁగల ఉపాసితయేఁడీ? ఆ వారిముఖదర్పణమునఁ బ్రతిఫలించుచున్న చిత్తవృత్తిఁ గనిపట్టఁగల ద్రష్టయేఁడీ?-ఈ నిశ్చల సమాధియందు, ఈమౌనయోగమున ఎన్నిగడియలు పరువెత్తినవో వారెఱుఁగరు. రామచంద్రుఁడు కీలూడినబొమ్మ యైనాఁడు. ఉన్నట్టుండి రంగనాయిక క్రిందికిఁ బఱచినది. గదిఁ బ్రవేశించినది. ట్రంకుమీఁది శాకుంతలము విప్పినది. అందు కాకితపు మడుపొకటి చూపడినది. కుతూహలముతో నొక్కమాఱు పాఱజూచినది. ముందు హాలులోని కురవడించినది. తరువాతి మార్గము గన్పడదు. స్మృతి వికలమైనది. ఇంటనున్న వారి పేర్లే జ్ఞప్తిలోలేవు. బాష్పావరుద్ధమై గళస్వనము దూషితమైనది. ఎట్టెదుటనున్న వంటలక్కనుగాంచి సప్రయత్నముగ-

"వాణ్ణి"—అని ఆలోచించినది— "అన్నయ్యని" అని క్షణ మాగినది— "రమ్మనమనండి"— అన్నది.

వంటలక్క:- "అబ్బాయిగారూ, చెల్లాయిగారు ర మ్మం టూన్నారు"—అని పిలిచినది. రామచంద్రుఁడు మార్వెలుకక ఏటి కెదు రీదినట్లు, అగాధకూపమున దిగినట్లు క్రిందికి రాఁ గలిగినాఁడు.

జట్కా వచ్చి ఇంటిముందు నిలచినది. బండివాఁడు పక్క చుట్టయు పోర్టుమాంటోయును దెచ్చి గుమాస్తాదస్కు కడఁ బెట్టినాఁడు. రామరావుపంతులు లోనికి తలగోకికొనుచు వచ్చి, సరాసరి గదిలోని కరిగినాఁడు. నివ్వెఱతో నిలచియున్న రంగ నాయికా—రామచంద్రులను జూచినాఁడు- కాని ఏయూహకు గారణము గలుగలేదు. ఉడుపులు విడిచి దొడ్డిలోనికి వెళ్ళి నాఁడు.

కాఫీ పుచ్చుకొని సావడిలోనికివచ్చుచు ఆ నిర్విణ్ణ మూర్తుల నిరువురను జూచి—

"ఏమి టాలా నిలబడ్డారు?"— అన్నాఁడు.

"రాండి"—అని రంగనాయిక తిన్నగా పారిజాతపు మొక్క కడకుఁబోయి చెట్టుక్రింది తిన్నెమీఁద చతికిలఁబడ్డది. తలగోకికొనుచు రామరావు, అతనితో ఎడమచేతివ్రేళ్ళతో ముంగురులం దడవికొనుచు రామచంద్రుఁడును వెళ్ళినారు-

రామచంద్రుఁడు అతిసమీపముననున్న తులసికట్టమీఁద గొంతుకూర్చుండి నేలమీఁద గీతలు గీయుచున్నాఁడు- ఎవ్వ రేదియు మాటాడుకొనరు-

"మీ రిద్దఱూ ఏదేనా తగాదా పడ్డారా ఏమిటి? ఈ యవతారా లేమిటి! దివాళాతీసినట్లున్నారు?" —అన్నాఁడు రామరావు.

రంగనాయిక కన్నీరు తుడుచుకొనుచు కాకితము చేతి కిచ్చినది. రామరావు మొదలు ఒకటి రెండు పంక్తులు తనలోఁ జదివికొని చివరభాగము జూచి—తలగోకికొనుచు—

"ఏమిటీ కృష్ణవేణమ్మ స్వయంగా వ్రాసిందే! అక్షరాలు ముత్యాలకోవలా ఉన్నాయి! తెలుఁగు బాగా చదివింది లా ఉంది! సంస్కృతంకూడా వచ్చా! నే నెఱుఁగనుసుమీ!"—అను చుండఁగా రంగనాయిక గద్గదికముగాఁ బైటచెఱఁగుతో గను లద్దికొనుచు—

"చదవండి బిగ్గరగాను"—అన్నది.

రామరా విట్లు చదువఁ దొడఁగెను:

"రాత్రి మేడమీఁద జరిగిన సంభాషణము సమగ్రముగ వింటిని; ఉమ్మలించితిని; వెఱ్ఱిదాన నైతిని; నిందకుఁ గారణము భూతమైనవ్యక్తిని నోనాడితిని— విధిని దూఱితిని. నిశీథము

వఱకు నా పడినఖేదము హృదయ మెఱుఁగును. క్రుమ్మరించిన కన్నీరిధారలు కను లెఱుఁగును. వివశాత్మనైన నన్ను నా మస్తాపము మేడమీఁది కీడ్చికొనిపోయినది. శయ్యాగతుఁడై సుఖనిద్రనున్న నాదేవుని నిన్ను గాంచి కనులు భాగ్యవంతము లైనవి. ధ్యానించి మనసు కృతార్థమైనది. నమస్కరించి కర యుగ్మము పభాజనమైనది. వరించి జన్మము ధన్యమైనది. గోడ నున్న పటమునందలి నీ రూపమును ముచ్చట దీఱ ముద్దాడి తిని. అంతట తీవ్రమైన ఆవేదనము దిగ లాగినది. దొడ్డివసా రాలోఁ జేర్చినది. దీపము తోడైనది. హృదయము చిందరవంద రలైనది. ఏమి వ్రాయుటకుఁ దోఁచువడదు. ఈ విఘాతమునకుఁ గారణమేది యని ప్రశ్న బొడమినది. 'ప్రాప్తవ్య'మని అంత రాత్మ బోధించినది. నిమిషమునకుఁ బూర్వము నాపడిన పరి తాప మంతయుఁ ,బామరత్వ మని తోఁచినది. మనసునకుఁ స్వాస్థ్యము కుదిరినది. ధైర్యము తలసూపినది. దారి కనఁబడినది.

ఇఁక నా హృదయమును నివేదింతును: వలపునకు వ్యాజము తెలియదు; హేతువు కనఁబడదు; కారణము లేదు; కేవలము నైసర్గికము— 'బావస్థిరాణి జననాంతర సౌహృ దాని' అనుటచే కారణ మేర్పడుచున్నది. అకారణ మయిన దానికిఁ గారణముఁ గల్పింపనా? అనిర్వాచ్యము వాచ్య

మగుట ఎట్లు? కావున దానిని అనవద్య మందును. కారణ రహితమైనది ప్రకృతి– స్వభావము. కారణముగలనాఁడు కృత్రిమ మగును. దానితో హేతువు–వ్యాజము పొందు వడును. శిశువుచిఱునగవునకుఁ గారణ మేదేని చెప్పఁగలదా?

ఇట్లనుటచే 'అవ్యాజప్రేమ సిద్ధాంతమునకా ఇంత తర్కము వినియోగించినది' !- అనిలాఘవము చేయుదువేమో!

మన ప్రణయకిసలయము కారణము నాశ్రయించి కృత్రిమదోహదక్రియాభాజనమై ముదిరి కాయుగ్రమ్మి పండి ఎండి రాలి పోవకమునుపే ఇట్లు ఘటించుట సమ్మోదావహము. సుఖము: బంగారు సంకెల; దుఃఖము: ఇనుప బేడి; రెండును ప్రకృతి నను భోగించుటకు నిర్బంధములే - నిరోధకములే. స్తుతికి సంతసించిన మానసము నిందకు సంతసింపదా ? మన ఎడబాటుననే ఈ మనప్రణయము నిత్యపల్లవిత మగునని నమ్మెదను. పల్లవమునకు భావి దశలు గలవు; ఫలమునకదియే చరమదశ.——

ఇది చదివి 'వేదాంత మొలుకఁ బోసినదా!' అని పరిహసింతువు కాఁబోలు!

నా యాత్మ నిను సర్వవిధముల ననుభవించినది. భౌతిక విఘటనమునకు వగ పేల? ఈ నా యవతారమున కింతటితో సమాప్తి. భావిగతి దైవాధీనము.—

'ఈ సాహస మంతయు బెదరింపా!' అని వెగటుగఁ దలంతువు కాఁబోలు!

ఇక నొక్కమాట—

సంశయ మున్న చోట ప్రేమము నిలువదు. ప్రేమ మున్న చోట సంశయము జేరదు. దీనిని జ్ఞప్తియందుంచుకొమ్ము. ప్రియమైన కన్యను వరింపుము; మనసిచ్చి మన్నింపుము. జీవయాత్ర సుగమముగ సాగింపుము. నన్నుఁ గూర్చి నేఁడు నీ వినిన కొంచెమైన యాథార్థ్య మెన్నటికేని వెలికి రాకపోవదు. అపుడు, నను దలంచి విడుచు నీయశ్రుకణ మొక్కటి చాలును—అది నాకు నివాపోదకము.

మంగళవారమునాఁడు రైలునుండి వచ్చి గుమ్మమున బండిదిగి మేడముంగిటనుండిన నను జూచిన చూపులును, గురువారము సాయంకాలము సికారుతలలుచు మొగము మలఁచి చూచిన చూపులును నా కెన్నేని మనోహర వృత్తముల జెప్పుచున్నవి. అవి నా యాత్మయందు భద్రముగ నున్నవి. నీ గీతికలు నీ గేయములు నాలో నైక్యమైనవి. నాకు గావలయునది లేదు- నీకు దెలియదగినది లేదు.

చరమ ప్రణామములఁ బరిగ్రహింపుము- సెలవు.

—కృష్ణవేణి."

... ... ...

అనుచు, రామరావు దుఃఖాశ్రువులతోఁ జదువలేక చదివినాఁడు. ప్రకృతి సర్వము ప్రళయగర్భమునఁ జొచ్చుచున్నట్లు దోఁచినది- స్తంభీభూతమైనది. ప్రభాతభానుఁడు ఈ స్థలకమును తొంగిచూచుచున్నాఁడు.

... ... ...

మధ్యాహ్నము మీఱినది. రామచంద్రుఁడు అంతర్ధానమైనాఁడు. వెదకిరి—ఏఁడీ? ........................

---

## ౧౩. ప్ర క ర ణ ము .

బెంగుళూరు "సామాజిక కైంకర్యసమితి" ("Social Service League") అంకురార్పణోత్సవము విభవసంవత్సర కార్తిక శుక్లద్వాదశి జరుప నిశ్చిత మైనది—ఎల్లుండియే. తదర్థము ఆహ్వానసంఘమువారు సమస్తసన్నాహములు మొదలిడిరి. పెద్దపెద్దలకు ఆహ్వానములు పంపిరి. మహిశూరుసంస్థానమునందలి ఉన్నతోద్యోగులు ఆహ్వానముల నందికొని సకాలమునకుఁ జేరవత్తు మని ప్రోత్సాహకరముగ కార్యద్రష్టకుఁ దెలిపిరి. పను లన్నియు నిమిషములమీఁద జరుగుచున్నవి. కార్యగమనము కాలగమనముతోఁ బందెము వేసి పరువిడుచున్నది. సభాభవనము-శ్రీనివాసమందిరము. మండి రాలంకారములు సాగినవి. శంకరునితో చార్వాకుఁడు, రామానుజునితో రామమోహనుఁడు, మహమ్మదుతో మధ్వాచార్యుఁడు, బుద్ధునితో విద్యారణ్యుఁడు, చైతన్యునితో జీససు, జోరాస్టరుతో నానకు, బసవనితో వల్లభాచార్యుఁడు, నందనారుతో నారాయణతీర్థులు, నామదేవుతో నాగూరు మీరాసాహేబు, వీరబ్రహ్మముతో వివేకానందుఁడు, తిరుప్పాణితో తిలకు, మహామదాలీతో మహాత్ముఁడు (గాంధి)—ఇట్లు కులభేదములు మతవివక్షలు దేశకాలావధులు పాటింపక మతప్రవర్తలపటములను భక్తులపటములను సామాజిక-దేశ

హితైకదీక్షాపరతంత్రుల పటములను గోడ కంతటఁ గట్టిరి. ఎటఁ జూచిన ధర్మప్రబోధకసూక్తులు చిత్రతము లైనవి.

అతిథులకు అభ్యాగతులకు వసతు లేర్పఱుపఁ బడినవి. వంటవార్పులకు వలయు పాత్రసామాను సువారపుగది చేరినది. భోజ్యవస్తుసామగ్రి ఉగ్రాణపుగది నిండినది.

సభాదినము తెల్లవాఱుజామునుండి సమితిసభ్యులెల్లరు తమతమవిధుల నిర్వర్తింప సమకట్టిరి. ఉదయము అఱున్నర గంట లగునంతకు రైల్వేస్టేషనునకు మోటారుగ్లు బ్రుహాములు కోచులు ఫీటనులు బఱవఁజొచ్చెను. అతిథులను సంభావించుటకు, వసతులను జేర్చుటకును ఐచ్ఛికకింకరులు యువకులు సైకిళ్ళమీఁద వాయువేగమునఁ బరుగువారు చున్నారు. ౭ గంటలకు మదరాసునుండి మెయిలు వచ్చినది. సమితిసభ్యులును ఐచ్ఛికకింకరులును ట్రెయినుపొడవునఁ అతిథులకై వెదకుచు ఆతురతతోఁ బర్విడుచున్నారు. రెండవతరగతిపెట్టెలో నాఁటిసభ కధ్యక్షుఁడుగా నంగీకరించిన ఆస్థానభూషణ శ్రీధర చౌడప్పగారు డెబ్బదియేండ్లవృద్ధు కనఁబడినారు. ఆయనను పుష్పమాలాలంకృతునిఁజేసి మెల్లఁగా మోటారులో బసచేర్చినారు. ఇంటర్‌డబ్బానుండి కొందఱ అతిథులు దిగినారు. వారును సముచితరీతిని సంభావితులై విడిదలకుఁ బంపఁబడిరి. ౭౪ అగునప్పటికి గుంతకల్లుట్రెయిను వచ్చినది. ఐచ్ఛికకింకరులు రివ్వున ఆబండివద్ద వ్రాలిరి. అతిథులకొఱకు వెదకిరి.

ఉత్తరహిందూస్థానము పెద్దమనిసి దిగినాఁడు. స్వచ్ఛమైన కదరులాల్చీతో టోపితో నున్నాఁడు. సమ్మానసంఘసభ్యులును ఇద్దఱటకుఁ జేరిరి. ఆదిగినపెద్దమనిసి నలువదియేండ్ల వాఁడు. సమితియుత్సవసందర్భమున నుపన్యసింపవచ్చిన రామచంద్రజీగారితఁడేనా యని శంకించిరి. పేరు అడుగఁ గూడదు. ఫలానావారు మీారా అని యడుగుటయు మర్యాద కాదు. ఆతనివద్దఁ చేతిచిన్నట్రంకు- పక్కచుట్ట- కాశీలోటా మాత్రమున్నవి. సమితివారు శంకించుచుండ నంతలో వకీలు రఘునాథశాస్త్రి వడివడిగ అచ్చోటికి వచ్చి బండి దిగిన యావ్యక్తినిఁ గాంచి అపూర్వపరిచితదృష్టిని బఱపినాఁడు.

"ఏమి, శాస్త్రీ, మఱచినావా?" అని యావ్యక్తి చిఱునగవుతో ననెను. శాస్త్రికనులలోఁ పూర్వస్మృతి ఇంచుక స్ఫురించినది. వెంటనే యాతఁడు—

"క్షమింపుము. నీచిఱునవ్వే నినుఁ దెలిపినది." అనుచు చేతిట్రంకు అందుకొన్నాఁడు. ఐచ్ఛికకింకరులు మూఁగి తల కొకసామాను దొరకపుచ్చుకొని రఘునాథశాస్త్రి మోటారు జేర్చిరి. అట నున్నసమితిసభ్యులు సమర్యాదముగ ఆయతిథి కంఠసీమఁ బూలమాల నలంకరించిరి. శాస్త్రియు, అతని మిత్త్రుఁడు—క్రొత్తవ్యక్తియు మెల్లన నడచి ప్లాట్‌ఫారమున కావల నున్న మోటారులోఁ గూర్చుండి వెళ్ళిరి.

---

## ౧౪. ప్రకరణము.

ఉదయము సమితిసభ్యబృందము గ్రామసంకీర్తనము చేసెను. సాయంకాలము ౫ గంట లగునప్పటికి సభామందిర మంతయు స్త్రీపురుషసమాకీర్ణమైనది. ఆచారము ననుసరించి యాహ్వాన సంఘాధ్యక్షుఁడు సమితినియతులను, ఉద్దేశ్యములను, తత్సంస్థాపనావశ్యకమును సమయోచితముగ సంగ్రహముగ సభాసదులకు శ్రుతపఱిచెను. అనంతరము ఆస్థానభూషణ చౌడప్పగారు అగ్రాసనాధిపత్యము వహించిరి. ఆయన యుపక్రమించుచు నిట్లుచెప్పెను:—

"ధనికు నెవ్వని నేని ఈపదవికి నియోగించియుండిన ధనము లభించి యుండెడిది. ఉన్నతోద్యోగిని వరించియుండిన సంస్థానసాహాయ్యము ప్రాప్తించి యుండెడిది. పండితునిఁ గోరి యుండిన బహువిషయములు వివృతములై యుండెడివి. అట్లు వానిలో నేయోగ్యతయు లేని యసమర్థుని నన్ను నియోగించితిరి. మీయాదరాతిశయమునఁ ధన్యుఁడను. ఈసమితి నాయాడిగము నంగీకరించునేని కృతార్థుఁడ నగుదును."

అని కార్యక్రమపట్టికఁ దిలకించి—

'మహీశూరుమహిళాసేవాసదనము' నుండివచ్చిన సోదరీమణుల గానము— ఇది మొదటివిషయము." అని చదివెను.

సేవాసదనపాలకురాలు వీణెయు, నొకకోమలి ఫిడీలు, ఇంక నొకసుదతి వేణువు, మఱియొకసుందరి హార్మోనియము శ్రుతిమేళవించి హంసధ్వనివర్ణము మొదలిడినారు.

"ఆకావిచీరెకట్టుకొన్నామె ఎవరమ్మా?" అని సభలోని మహిళయొకతె ప్రక్కనున్న నారీమణి నడిగినది.

"ఆవీణె వాయిస్తూవుండే ఆమేనా? ఎవరో ఆశ్రమవాసినివలె కనంబడుతున్నది. మైసూరు సేవాసదనమున పని చేస్తున్న దని, మంచి శీలవంతురా లని చాలా మెచ్చుకుంటారు- ఈమే కాంబోలునమ్మా!" అని యానారీమణి బదులుచెప్పెను.

"మనసు పరిపక్వమైతేసరి అన్నిత్యాగాలు అదే తెస్తుంది" అని నడిప్రాయపు ముత్తైదువ యొకర్తు అన్నది.

"మనం చేయకపోయినా చేసేవాళ్ళనిచూచి సంతోషించినా కొంతపుణ్యమేనమ్మా"- అన్నది ఇంక నొకపూర్వసువాసిని-తొలంగిన ముసుగు తలమీందికి సవరించుకొనుచు.

"వా రక్కడహాయిగా సంగీతం పాడుతుంటే ఇక్కడ మీరు గుసగుసలు రొసరొసలూ ప్రారంభించినారే మమ్మా!" అని తదేకధ్యానముగా ఆస్థతో ఆపాటవినే నవయువతి ఈసడించినది. యువతి యొకతె కంజీరామీంద నానాకృతుల లయగతులను జూపి సదస్యమును చెవులుబట్టి యాడించినది. రెండుకీర్తన లగునంతకు అరగంటయైనది. సభ్యులు చిత్రప్రతిమ

లైనారు. తదుపరి అధ్యక్షుఁడు, "విశ్వకైంకర్యము" నుగూర్చి, నాగపురమునుండి యాహూతులైన శ్రీరామచంద్రజీగారు ప్రసగింతు రని తెలుపుచు ఆతని విద్యావినయసంపదలఁగూర్చి, చిత్తసంస్కృతినిఁగూర్చి, వైరాగ్యమార్గమునుగూర్చి, ప్రకృత మాయన నాగపురమునందలి అనాథశిశుశరణాలయమునకుఁ జేయుచున్న సేవనుగూర్చి ప్రశంసించి, సభ కాతనిఁ బరిచితుఁ గావించెను. రామచంద్రజీ సభాసదుల కరతాళధ్వనులు మిన్ను ముట్టుచుండ నుపన్యాసరంగమునకు నడచెను. ఆతని యాని రాడంబరవేషము, ఆవినయవినమ్రభావము, ఆదృక్కులలోని శాంతత సభ్యలోకము నాకర్షించినవి.

రామచంద్రజీ— భూతసేవాధర్మములను గుఱించి, భ్రూణహత్యాదిమహాఘోరముల నరికట్టఁదగు విధానములను గుఱించి, మానవసహజములగు భ్రమ ప్రమాదములకులోనై సంఘక్రూరతకు ఎరయై, చ్యుతలై జీవనమును దుఃఖభాజన మొనరించుకొను తోడబుట్టువులఁ గనికరమున నాదరించి సంస్కరించి సంఘసేవకై వినియోగింపవలయు నావశ్యకముం గురించి, ప్రకృతిసిద్ధ మగుప్రేమము ననుష్ఠించి యనుసంధించు టకన్నఁ బరమార్థసాధన మొండులేమింగుఱించి, అనేక దృష్టాంతములతో గీతా శాస్త్రపురాణేతిహాసములందలి ప్రమాణములతో నుపన్యసింపఁ దొడఁగెను. సభాసదులహృదయములలోఁ మొలకలెత్తినయావేశము వారిముఖములయందు

ద్యోతకము లగుచుండెను. కరఁగినహృదయము కనులనుండి కరుణరస మోడ్చినది. మహీశూరమహిళాసేవాసదనపాలకు రాలి కనులనుండి యనూనవృత్తి యొకటి దీపించెను. ఉపన్యా సమధ్యమున రామచంద్రజీ ఆపాలికముఖము రెండు మూఁడు తడవలు గాంచెను. అతనిదృష్టిలో కరుణముతోఁ గౌతూహ లము వియ్య మందినట్లు గనఁబడెను.

రామచంద్రజీప్రసంగము సమస్తసభ్యజనసంస్తుత్య మైనది— ముగిసినది— వక్త పీఠ మలంకరించినాఁడు. తరువాత ప్రసంగించినవక్తల ఇరువురలో నొకఁడు హాస్య మెక్కుడుగాఁ గలిపి నవ్వులతోఁ గడపినాఁడు. మఱియొకఁడు ఛాందస మార్గమున విసువు పుట్టించినాఁడు.

అధ్యక్షుఁడు, ఈసమితిప్రశస్తి నగ్గించుచు ధనికులు ధనమును, సేవాపరాయణులు జీవధనములను బ్రసాదించి ఈసమితిని లోకోపకారార్థము వినియోగింపవలయునని ప్రార్థించెను. మహీశూరమహిళాసేవాసదనము చేయుచున్న నిర్వ్యాజసేవనుగూర్చి కొండాడెను. పదంపడి రామచంద్రజీ సాధుశీల తకుఁ దగియున్న ఆతని వ్యాఖ్యానమునందలి సద్విషయము లను, అతనిచిత్తవృత్తినిఁ బ్రకటించు ప్రసన్నవ్యక్తిత్వమును ఆతనిసంస్కారమును త్యాగమును తలఁచు వినుతించుచు నుప సంహరించెను. శ్రమ యనక ఈయంకురార్పణోత్సవమును నిర్వహించినందులకు అధ్యక్షునకును, వక్తలకును సమితి పక్షమున కార్యద్రష్ట వందనము లర్పించెను. జయజయని నాదములతో సభసమాప్త మయ్యెను.

## ౧౫. ప్ర క ర ణ ము .

మఱుదిన ముదయము కల్యములు దీర్చికొని శాస్త్రియు రామచంద్రజీయును మేడమీఁదిగదిలో చెరియొకకుర్చీ మీఁద గూర్చుండిరి. వంటవాఁడు శాస్త్రి కొకగిన్నెడుకాఫీయును రామచంద్రజీ కొకగిన్నెడుపాలును దెచ్చి వారి యెదుటనున్న చిన్నబల్లమీఁద నుంచి పోయెను. శాస్త్రి కాఫీ పుచ్చుకొనుచు ని ట్లనెను:

“నీ లో నీసంస్కారవాసన బి. ఏ.లో చదువుతూ వున్నప్పటినుంచే కనబడుతూ వచ్చింది. ఆవాసన పూర్తిగా పరిపాకం చెందింది. ఆనాటి నీసౌందర్యానికి ఇప్పటి నీశాంతత భూషణమైంది. రాత్రి నీవు చెప్పినకథలు కలలలాగున నున్నవి. ఇదంతయు జన్మవాసనాలబ్ధమేసుమీ! అందుకు మెఱుఁగు బెట్టినట్లు భాగ్యవశాన సాంగత్యమూ అట్టిదే ఘటించింది. చూస్తే విధివిధానంతప్ప మరేమీ కనఁబడదు.”

అనుచుండఁగా—“పార్టీలు వచ్చి కాచి వున్నారు” అని గుమాస్తా వచ్చి తెలిపెను.

శాస్త్రి—“తెల్లవారింది- ఇఁక ప్రపంచనటన- ఈ వకీలువృత్తిమీఁద నాకు రోతపుడుతూ వున్నది. కాని నిజమైన రోతమాత్రం కాదు- అంతలో రక్తీ అంతలో విరక్తి” అనుచుండగ ఇంటిబంట్రోతు ఒకకార్డును పట్టుకొని వచ్చి అందించినాఁడు- శాస్త్రి దాని నందికొని చూచి—

"ఓహో! ర మ్మను" అని రామచంద్రజీతో—నిన్న వీణ వాయించినామె- మైసూరు మహిళాసేవాసదనానికి పాలకు రాలు-పవిత్రజీవి-సంస్కృతాంధ్రములు చక్కఁగా వ్యాసంగం చేసింది- వితంతు వట!"—

అనుచుండునంతలో పాలకురాలు గదిఁ బ్రవేశించి నది-నమస్కారము చేసినది- శాస్త్రి కూర్చుండ మని కుర్చీ చూపినాఁడు. పంజరబద్ధమైన చిలుక బయల్పడి పక్షములు విదిర్చి పై కెగయు నట్లు ఒక్క దూకు దూకిన తనచిత్తమును నెమ్మదిగఁ జేరదీసికొనిన దాయమ- అంత సహజనిజవినయ శీలమునఁ గ్రింద తివాచిమీఁదఁ గూర్చుండి నేలఁ జూచుచు నిట్టూర్పు నిగిడ్చినది. అనిర్వాచ్య మగు వైకల్పికవృత్తి ఆమెలో నుదయించి ప్రస్తావన మొదలు ఫలశ్రుతివఱకు నటించినది.

రామచంద్రజీ తలవంచి తనలాల్చీ గుండీనిఁ జూచు చున్నాఁడు. ఆగుండీ ఏ పురాణకథలు వినిపించు చున్నదో! శాస్త్రి తన యీయవలయు చందా వారము దినములలోఁ బంపుదు నని ఆమెకుఁ దెలిపినాఁడు. ఆమెయు "చిత్తము" అన్నది మధురనిస్వనమున-నతాస్యయై. రామచంద్రజీ మౌన దుర్గద్వారము భేదిల్లినది. కరుణము కనీనికలం దడిపినది; గుండీమీఁదిచూపు చలింప లేదు; ఆతని పెదవుల నుండి గాద్గదికముగా—

"మీ యన్నయ్య క్షేమము తెలియుచున్న దఁటమ్మా?" అనుచు శాస్త్రి విస్మితుఁడై నాఁడు. పాలకురాలు తనయుద్విగ్నచిత్తము నాగిపట్టి సాశ్రులోచనయై నిబ్బరముగా—

"రంగనాయిక క్షేమములునూ తెలియు చున్నవి. నేఁటికి దయగలిగినది చెల్లెలిమీఁద అన్నయ్యగారికి! మా నివాసదనమును పావనము చేయు ననువుపడునా?" అని స్పందితస్వనముతో నల్లనఁ బలికెను. శాస్త్రి కిది యపూర్వముగాఁ దోఁచినది. ఈ యద్భుతసంవిధానముం గూర్చి వినుటకు శాస్త్రికిఁ గలిగిన కుతూహలము రామచంద్రజీ కనిపట్టి—

"ఒక యూరివారము-బంధుత్వము - నాకు చెల్లెలు."- అని గుండీ చూచుచునే—

"ప్రయాణ మెప్పు డమ్మా?" అనెను.

"మీ యనుకూలము ననుసరించి."

"మీబస?"

"శ్రీనివాస మందిరమే." అని—

ఆమె లేచెను. శాస్త్రి రామచంద్రజీ ఆమె వెంటఁ దరలి క్రిందికి గుమ్మమువఱకుఁ బోయిరి. పరస్పరనమస్కారములతో ఆమె బండిలోఁ గూర్చుండి వీడ్కొనెను.